6-9-1991 శుక్రవారం 12 పేజీలు సంపుటి : 62 సంచిక 35 విడిప్రతి : రు 1.50లు

# జమీన్‌రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకటరామానాయుడు    మేనేజింగ్ ఎడిటరు : నెల్లూరు శ్రీరామమూర్తి

## జమీన్‌రైతు జీవితంలో

జమీన్ రైతు జన్మ చరితార్థమైంది తెలుగు పత్రికా ప్రపంచపు చరిత్రా సువర్ణాక్షర లిఖితమైంది.

ఆగస్ట్ 29 తేదీ సాయం సంధ్యా సమయంలో అంబరమండే సంబరంతో జరిగిన జమీన్ రైతు వజ్రోత్సవం పలువిధాలవిశిష్టమైనది. ఆంధ్రదేశంలో మరేవారపత్రికకే అరవయ్యేళ్ళ పాటు అవిచ్ఛిన్నంగా నడిచిన ఘనత లేదు.


వజ్రోత్సవ సంచికను వెలువరిస్తున్న వెంకట్రామన్, కృష్ణకాంత్.

# సువర్ణాక్షరలిఖితం-ఈ వజ్రోత్సవం


శోభాయమానంగా అలంకృతమైన "ఉత్సవ వేదిక ". క్రింది భాగంలో రామానాయుడి గారి చిత్రపటం

వజ్రోత్సవం జరుపుకోనే భాగ్యంపొందలేదు. ఒకచిన్నవార పత్రిక ఉత్సవంలో భారత రాష్ట్రపతి పాల్గొన్న సాదృశ్యం స్వరాజ్య భారతంలో మరెక్కడా లేదు. ఒక ప్రాంతానికి పరిమితమై, ఆ ప్రాంతం ప్రజలకు వారధిగా భావించి, ఆ ప్రాంతం ప్రజల భాషనే తన శైలిగా స్వీకరించి నడిచే పత్రిక జమీన్ రైతు తప్ప దేశంలో మరొకటి వుండదు. ఇన్నివిధాలవిశిష్టమైనది. కాబట్టి జమీన్ రైతు వజ్రోత్సవవేడుక అంత సంబరంలో జరిగింది. ఆనందాల పండుగగా భాసించింది.

29 తేదీ సయంత్రం సరిగ్గ నాలుగు గంటల సమయం. మద్రాసు బస్టాండు కూడలిలో మనోహరంగా తీర్చిదిద్దిన సభాప్రాంగణంలో ఉత్సవ సభావేదిక సిద్ధమైనది. త్రివర్ణ పతాకం వర్ణాల్లో మల్లెలు , మరువం, బంతులతో శోభాయమానంగా అలంకరించారు వేదికను. పూలసువాసనలు ఆ పరిసరాల్నింటిని పరిమళభరితం చేశాయి. వేదికాంతర్భాగంలో జవహర్ చిత్రపటం, వేదికముఖద్వారంలో జమీన్ రైతు జనకులు స్వర్గీయ నెల్లూరు వెంకట్రామానాయుడిగారి చిత్రం అలంకరింప బడ్డాయి. నగిషీలు చెక్కిన కుర్చీలతో వేదికకు వింత శోభచేకూరింది.

గడియారం ముల్లు సరిగ్గా నాలుగు మీదకు చేరే సమయంలో రాష్ట్రపతి ఆర్.వెంకట్రామన్ సభాస్థలికి చేరుకున్నారు. అప్పటికే ముఖ్యమంత్రితో సహా అతిథులందరూ సిద్ధంగా నుండినారు. నెహ్రూవిగ్రహ ప్రతిష్టాపన కమిటి కన్వీనర్ తో సభ ప్రారంభమైంది. జమీన్ రైతు మేనేజింగ్ ఎడిటర్ శ్రీ నెల్లూరు శ్రీ రామమూర్తి పత్రికపక్షాన ఆహ్వానం పల్కారు. జమీన్‌రైతు చరిత్రలో ఇదొక చరిత్రాత్మక దినం. నెల్లూరు చరిత్రలో కూడా! భారత రిపబ్లిక్ ఏర్పడిన తర్వాత రాష్ట్రపతి నెల్లూరులో ఒక కార్యక్రమంలో పాల్గొనడం ఇదేప్రథమం. ఒక పత్రిక ఉత్సవ వేదిక మీద రాష్ట్రపతి ,గవర్నరు, ముఖ్యమంత్రి ఆసీనులు కావడం కూడా ఎప్పుడూఎక్కడా జరిగి వుండదు. జమీన్ రైతుతో ప్రారంభమాది ఈ రోజు వరకు అత్యంత సన్నిహిత సంబంధం కల్గిన రంగాగారు, గోపాలరెడ్డి గారు ఈ ఉత్సవంలో పాల్గొనడం మా భాగ్యం అన్నారు. రామమూర్తిగారురాష్ట్రపతి ఈ ఉత్సవంలో పాల్గొనడం చిన్న పత్రికలన్నింటికీ గుర్తింపు అంటూ ఈ మహదవకాశం కల్పించిన జనార్దనరెడ్డి కి ధన్యవాదాలు తెల్పారు.

జమీన్ రైతు కు అత్యంత ఆప్తుడైన స్వర్గీయ బెజవాడ వెంకటనారాయణరెడ్డి స్మృతి చిహ్నంగా జమీన్‌రైతు నూతన భవనంలో ఒక హాలుకు నామకరణం చేసేందుకు, ఆయన దగ్గరి బంధువైన శ్రీఏనుగు సీతారామరెడ్డిగారు, తన అన్న ఏనుగు శ్రీనివాసులు రెడ్డి ట్రస్ట్ నుంచి లక్షరూపాయల విరాళం ఇచ్చేందుకు సంసిద్ధత తెలిపారని సభాముఖంగా ప్రకటించారు. తర్వాత, ఆంధ్రజ్యోతి సంపాదకుడు శ్రీనండూరి రామమోహన

కొరవ 10 పేజీలో


నెల్లూరు నగరానికి నూతన శోభ తెచ్చిన నెహ్రూ విగ్రహం

## ఎందు కింత రాద్ధాంతం ?

రాష్ట్రపతి శ్రీ ఆర్. వెంకట్రామన్ జమీన్‌రైతు వజ్రోత్సవాలలో పాల్గొనడం పై దిన పత్రికలలో, రాజకీయ వాదులలో తలెత్తుతున్న వ్యాఖ్యలు చూస్తుంటే విచారం కల్గుతున్నది. ఒక వార పత్రికకు ఇంతటి గౌరవం కల్గడం, రాష్ట్ర పతి సన్నిధిలో వజ్రోత్సవం జరుపుకొనే భాగ్యం సిద్ధించడం చూసి ఓర్వలేక, రాష్ట్రపతి పర్యటనకే పెడార్థాలు తీస్తున్నారు కొందరు " మిత్రులు".

వెంకట్రామన్‌గారు జమీన్‌రైతు ఉత్సవంలో పాల్గొనడానికి నెల్లూరు రాలేదని ప్రజలను నమ్మించడానికి వక్ర బుద్ధి కల్గిన పాత్రికేయ సోదరులు పనిగట్టుకొని తప్పుడు వ్రాతలు వ్రాస్తుంటే, జిల్లా రాజకీయ వాదులు ఈ సభలకు ఆయన రావాలా అని సణుగుతున్నారు. దీన్నొక పెద్ద వివాదంగా సృష్టించి రాద్ధాంతం చేస్తున్నారు. మనుషులలో ఇంత సంకుచిత తత్వం ఎందుకు తలెత్తుతుందో, ఓర్వ లేనితనం ఎందుకు ప్రేరేపణ అవుతున్నదో అర్థమే కాదు.

ఓర్వ లేని తనంతో రాష్ట్రపతి రాకను వక్రీకరిస్తున్నారు!

రాష్ట్రపతి నెల్లూరు పర్యటన ప్రథమోద్దేశ్యం జమీన్ రైతు వజ్రోత్సవమే నన్న వాస్తవం అందరికీ తెలుసు. నెహ్రూ విగ్రహం ఆఖరి నిముషంలో అమకున్న కార్యక్రమం. మొదట నిర్ణయమైన ప్రకారమైతే జమీన్‌రైతు పండుగ కస్తూరిబా కళాక్షేత్రంలో జరగవలసింది. కాని భద్రతా కారణాలు, సాయంత్రమైతే హెలికాప్టర్ ప్రయాణంలో వచ్చే చిక్కుల వల్ల రెండు సభలూ కలిసిపోయాయి. రాష్ట్రపతి కార్యాలయం నుంచి అందిన వర్తమానం ప్రకారం, శ్రీ వెంకట్రామన్ తన ప్రసంగంలో కొంత భాగం జమీన్‌రైతుకు కేటాయించారు. ఆ ప్రకారం ప్రసంగ పాఠంకూడా సిద్ధమైంది. కాని అనూహిత రీతిలో సభకు విచ్చేసిన జన సందోహాన్ని చూసి రాష్ట్రపతి ఉత్తేజితుడై, ప్రసంగ పాఠం ప్రక్కన పెట్టి, ధారాళంగా మాట్లాడారు. ప్రసంగం చివరలో వాన చినుకులు పడడంతో, భద్రతా సిబ్బంది సూచన మేరకు ఆయన ఉపన్యాసం అర్థంతరంగా ముగించ వలసి వచ్చింది. ఈ హడావుడిలో జమీన్‌రైతు ప్రస్తావన తేవడం మర్చిపోయారు.

కొరవ 11 పేజీలో

# పినాకినీ తీరం

## డాక్టరుకు పదవి

ఆత్మకూరు శాసనసభ్యుడు డాక్టర్ బి. సుందరరామిరెడ్డి గారిని స్టేట్ ఫైనాన్స్ కార్పొరేషన్ చైర్మన్ గా ప్రభుత్వం నియమించినట్లు వార్త. ఇటువంటి పదవులు ఎన్నయినా మంత్రిత్వంతో సమానం కాదనుకోండి. అయినా మంత్రిత్వానికి అవకాశాలేర్పడడం,పెద్ద పదవి ఏదో ఒకటి లభించడం సంతోషమే గదా!

స్టేట్ ఫైనాన్స్‌కార్పొరేషన్ అంటే చిన్నదేమీకాదు; చిన్నచిన్నవాళ్లతో వేగర్చింది కూడా కాదు. లక్షలు,కోట్ల రుణాలు పంపకంచేసి బడాబడాలతో మెలిగే హెరంగరిగిన పదవి. సభలు,స్వాగతాలు, [illegible], సన్మానాలు,మేళతాళాలు,శిలాఫలకాలు, అధికారుల పడిగాపులు గాయదాలు . కోరినవారికి కోరినవనిచేసి నిత్యం ప్రజలతో అనుబంధాన్ని పెంచుకోవడం వంటి మంత్రిత్వంలో వుండేముఖ్యాటువంటి పదవులలో లేకపోయినా, వుండేవాటిలో కాస్తవిలువ కలిగినదేననిచెప్పవచ్చును. డాక్టరు గారు విద్యావంతులు! చిక్కకుండా దక్కకుండా అందరికీ ఒకహితవేసి సర్వప్రియుడుగా మెలగగలిగిన చతురుడు! కాని ఇప్పటివరకు రైతులు, సామాన్యప్రజల సమస్యలతో మునిగితేలుతుండిన వ్యక్తికి ఈ పదవి కొత్తగా వుండబోతుంది! నిత్యం తీరికలేకుండా ప్రజలమధ్యవుండే వ్యక్తికి. ఏ కొద్దిమందితోనే వ్యవహారించవలసి రావడం నిర్వ్యాపారత్వంగానే వుండబోతురది.కానిఇంమైన ఈ పదవి చేతబట్టుకొని,తననియోజక వర్గం

కొరవ 8 పేజిలో

# ప్రజల భాషతో, ప్రజలకు చేరువైన తొలి తెలుగు పత్రిక

జమీన్‌రైతు పత్రికోత్సవం సభలో జమీన్‌రైతుకు ఆప్తులు, ఆత్మీయులైన పెద్దలు బెజవాడ గోపాలరెడ్డి గార్ల ప్రసంగాలు యథాతథంగా దిగువ ఇస్తున్నాము

జమీన్ రైతు పత్రికోత్సవం సందర్భంలో రాష్ట్రపతి రావడం చాలా ముదావహం. సాధారణంగా రాష్ట్రపతులు పత్రికల సభలకు రారు. అయినా వెంకట్రామన్ గారు జమీన్ రైతు పత్రికోత్సవానికి రావడం చాలా సంతోషం. ఆంధ్రదేశంలో పత్రికలు తక్కువ. పత్రికోత్సవం చేసుకొనే వైభవం కల్గినవి అసలేలేవు. జమీన్ రైతుకు ఆ భాగ్యం దక్కింది. నాకు జమీన్ రైతుతో ఉద్యమం దగ్గరి నుంచి సంబంధం వుంది. చాలా కొద్ది సంబంధం; రంగా గారి కున్నంత సంబంధం కాదు. వారు మొదట జమీందారీ విధానం రద్దు కావాలి తర్వాత స్వరాజ్యంకోసం మద్దతివ్వాలి. అనే ఉద్దేశ్యంతో 'జమీన్‌దారీరైతు' అనే పేరుతో పత్రికప్రారంభించారు. తర్వాత అది జమీన్ రైతు అయింది. ఆరెండూ కూడా ఈనాడు జమీన్ రైతు ప్రత్యక్షంగా చూస్తున్నది. స్వరాజ్యం

## ప్రసంగాలు

వచ్చింది.జమీందార్లు రద్దయినారు. ఏ శుభ సమయంలో జమీన్ రైతు పుట్టిందో, అనుకొన్న దానికంటే త్వరగా ఆ రెండు సంకల్పాలూ నెరవేరాయి.

రామానాయుడుగారు 20 సంవత్సరాలు పత్రికనడిపారు. ఎన్నికలు వచ్చాయి. యుద్ధాలుజరిగాయి, ఎన్నో విప్లవాత్మక విషయాలు జరిగాయి. ఈ 60 సంవత్సరాలలో ఎన్నోమార్పులు సెరులు ఎంతో స్వేచ్ఛ అనుభవిస్తున్నారు.

జమీన్‌రైతుకు వారే చెప్పినట్లు ఇదొక మజిలీ మాత్రమే శతాబ్దం వైపు పయనిస్తున్నామని ఎంతో ధీమాతో ఆత్మవిశ్వాసంతో చెప్పున్నారువారు. సంతోషం. జమీన్ రైతు ఎక్కవలసిన ఎత్తులు యింకా చాలా వున్నాయి.

కొరవ 11 పేజిలో

# జమీన్‌రైతు

# రష్యా చరిత్ర సమాప్తం

మహోన్నత వహించిన సోవియట్ రష్యా చరిత్ర పరిసమాప్త మైపోయింది. అగడ్తపై పుట్టి, మహామేరు పర్వతంవలె విస్తరించిన కమ్యూనిస్టు పార్టీకి నూకలు చెల్లిపోయాయి. ప్రపంచంలో ఏనాటికైనా కార్మిక, కర్షక, పీడిత, తాడిత, అణగారిన ప్రజానీకపు సార్వభౌమత్వం స్థాపించాలని లెనిన్ మహాశయుడు కన్న కలలు కుప్ప కూలిపోయాయి. కాపిటలిజం అంతరించి, విశ్వాంత రాళమంతా శ్రామిక జన సామ్రాజ్యం పరిఢవిల్లు తుందని మార్క్స్ చెప్పిన సిద్ధాంతం మట్టి కలిసిపోయింది. 20 శతాబ్దపు ప్రథమార్థంలో నూతన మార్గనిర్దేశం చేసే మహోన్నత ప్రజాపరిపాలనా విధానంగా ఆవిర్భవించిన కమ్యూనిస్టు సిద్ధాంతం, 21 శతాబ్దం పొలిమేరలలో తనకు తాను సమాధి కట్టుకొని, చారిత్రక స్థూపంగా నిల్చిపోతున్నది.

శ్రామిక జన ప్రభుత్వమనే ఆశయానికి తిలోదకాలిచ్చి, నియంతృత్వాన్ని పెంచి పోషించిన స్టాలిన్ వంటి నాయకుల పాలనలో విసిగి పోయిన రష్యన్లు, గొర్బచేవ్ సరళ విధానాల ఆసరాతో దాస్యశృంఖలాలు త్రెంచుకొని, కమ్యూనిజం పైన ద్వేషం వెళ్ళగ్రక్కుతున్నారు. ఈ సందు చూసుకొని ఎప్పుడో సోవియట్ యూనియన్‌లో అంతర్భాగంగా కలిసిపోయిన రిపబ్లిక్‌లు స్వతంత్రం ప్రకటించు కున్నాయి. దేశం విచ్ఛిన్నం కాకుండా రిపబ్లిక్‌లకు అధిక అధికారాలిచ్చి సమగ్రతను కాపాడడానికి గొర్బచేవ్ చేసిన ప్రయత్నం, స్టాలినిస్ట్ ల తిరుగుబాటుతో విఫలమైంది.

ఈ రాజకీయ సంక్షోభం ఆసరాగా ఎల్ట్‌సిన్ ప్రజాస్వామ్య పవనాలను పెనుతుఫాన్‌గా మార్చి వేశాడు. ఆయన అండతో ప్రాణాన్ని, పదవిని కాపాడుకొన్న, గొర్బచేవ్ ఆయన మాటకు ఎదురు చెప్పలేక పోయాడు. ఫలితం -యూనియన్ ఆఫ్ సోవియట్ సోషలిస్ట్ రిపబ్లిక్ కాస్త ఛిన్నా భిన్నమై, విడివిడి స్వతంత్ర రాజ్యాల సమష్టి ప్రభుత్వంగా రూపాంతరం చెందింది; నామమా త్రావశిష్టమైంది. స్వతంత్రం ప్రకటించుకున్న రాష్ట్రాలు కమ్యూనిస్టు పార్టీని నిషేధించి, ఆస్తులు తమలో కలుపుకున్నాయి. సోషలిజానికి స్వస్తి చెప్పి స్వేచ్ఛా మార్కెట్ వ్యవస్థకు ప్రాణం పోశాయి. పాశ్చాత్య దేశాలతో నేరుగా దౌత్య సంబంధాలు నెలకొల్పు కుంటున్నాయి. ఆయుధాలు, సైన్యం తప్ప మాస్కో పాలకులకు మరేమీ మిగల లేదు. లెనిన్ విగ్రహాలను తమ ప్రజలు తమ కళ్ల ఎదుటే కూలగొడుతుంటే గ్రుడ్లప్పగించి చూడడం తప్ప మరేమీ చేయ లేక పోతున్నారు.

తూర్పు యూరోప్ అంతా ఇప్పటికే కమ్యూనిజం భూస్థాపితమై పోయింది. రష్యాలో దానికి సమాధి కట్టినట్లే లెక్క. చైనా ఒక్కటే, ప్రజాస్వామనే సముద్రం మధ్య ద్వీపం వలె ఎంతో కాలం మిగిలివుండ లేదు. ఏదో ఒక రోజు అదీ చిల్లి పడవ వలె మునిగిపోక తప్పదు.

కమ్యూనిజం పతనానికి అమెరికా వంటి పాశ్చాత్యదేశాలు తమ వంతు కృషి, శక్తి వంచన లేకుండా చేశాయి. రష్యా పతనమైతే, ఇక ప్రపంచంలో వారికి ఎదురే వుండదు. తమ సంపదతో సైనిక శక్తితో బడుగు దేశాలపైన కర్రపెత్తనం చలాయించే అవకాశం దొరుకుతుంది. ఇండియా వంటి వర్ధమాన దేశాలకు వాంఛనీయ మైన పరిణామం కాదది.

మహత్తర ఆశయంతో, కోట్లాది ప్రజానీకపు రక్త తర్పణతో అవిర్భవించిన ఒక మానవ వ్యవస్థ, ఇట్లా అంతర్థానం కామండడం విచారకరం. లోపాలుంటే పుండవచ్చు గాని కమ్యూనిజం ప్రపంచ మంచి అదృశ్యమౌతున్నదంటే ఎవరికైనా బాధే!

## జమీన్‌రైతు

5.9.1941

10 పేజీలు — అణా

### రెండు గ్రహణాలు

5.9.41, 21.9.41తేదుల్లో చంద్ర, సూర్య గ్రహణాలు ఒకే మాసంలో వస్తున్నవి గాన యుద్ధ తీవ్రత వర్షలోపం, ధరల పెరుగుదల, వ్యాధుల ప్రాబల్యం ఉంటుంది.

### తక్కరు బాబా రాక

బాబాగారు 2 తేదీ నెల్లూరు వచ్చి యానాది సంఘాలు, హాస్టలు, మాలతీయుట మున్నగునవి సందర్శించారు. విడవలూరు వెళ్లి వచ్చారు. వారి రాకచే కలిగిన మేళ్లు - 12 మంది బాలికలకు హాస్టలు వ్యయం భరిస్తానన్నారు. యానాది ప్రచారకునికి నెల 1కి రూ10లు యిస్తానన్నారు. విడవలూరులోబడి పెడితే అయ్యవారి జీతం నెల రూ.7లు చంతున భరిస్తానన్నారు. రూ35 లకు రాట్నములు కొని విడవలూరు యానాదులకు యిచ్చారు. యానాదుల చరిత్ర ఇంగ్లీషులో రాఘవయ్య వ్రాస్తే ప్రచురణ ఖర్చులన్నీ తాము భరిస్తామన్నారు.

### నెల్లూరు ముచ్చట్లు ఫస్ట్‌గ్రేడు కాలేజి

చిన్న సాహితీ సమితికి అధ్యక్షత వహించిన శ్రీమంతులు తిక్కవరపు రామిరెడ్డిగారు కాలేజిని( వి.ఆర్.కాలేజి ) ఫస్ట్‌గ్రేడు చేయించడానికి కమిటీవారు కృషిచేయుమని ప్రబోధించారు. కమిటీవారు తమ తమ వర్గాలకు ఉద్యోగాలిస్తారు.గాని ఫస్ట్‌గ్రేడుకు కృషిచేస్తారా? భ్రష్టు గ్రేడ్‌కు తేకుంటే చాలు.

### 50 ఏళ్ళ క్రితం ఈవారం

### న్యూకోమల విలాస్

కోమల విలాస్, కేరళవిలాస్ ఇత్యాది హోటళ్ళ ధర్మకర్త అయిన నారాయణ నాయరు గారు ట్రంకురోడ్డులో ఒక సర్వసుందరభవనం నందు న్యూకోమల విలాస్ అనే బోర్డింగ్, లాడ్జింగ్ భవనాన్ని స్థాపించాడు. దీన్ని జిల్లా కలెక్టరు కరీంతుల్లా సాహెబ్‌గారు ఓపన్ జేశారు. వీరు కలెక్టరు ద్వారాయుద్ధనిధికి సమర్పించిన వెండి కదండం అక్కడే వేలం వేయగా కాంగ్రెస్సు భక్తుడని పేర్గాంచిన కడయాల నారాయణ హోటల్ ప్రొప్రయిటరు చంద్ర నాయరు, వస్తువులేమో యానాదుల సాయంతో బ్రాహ్మణులే తయారు చేయబడేవి. హోటలు ఓపన్ జేసింది మహమ్మదీయోత్తముడు హిందూ నవాతములారా! మీరంతావెళ్లి యథోచితం మెక్కిరాండయా ........ అప్పులుబెట్టకుండా!

### వరగలి డాక్టరు

పైసాలేని దరిద్రులకుమందు లేదు, మాకు లేదు. అబ్బా! కన్నుని పైవబడలాడండి ! రోగులు డాక్టరువద్దకు పోవడమేమానుకున్నారు. ఎందుకండీ ఈ ఆస్పత్రి?

### యుద్ధపురాణం

యుద్ధంప్రారంభమై రెండేళ్లుదాటింది. మూడవ ఏడు ప్రారంభం అయినది. గానీ ఇంతవరకు తలాలోకా కనబడడం లేదు. యుద్ధరంగం" ఇంతింతై వటుడింతయై "అన్నట్లు లోకాన్ని అంతా కబళిస్తూంది. చిన్న చిన్న రాజ్యాలకు స్వాతంత్ర్య జీవనం కల్ల అయింది కదా, బడాబడా సామ్రాజ్యాలే గడగడలాడుతూ వున్నవి. రష్యాకు అగ్నిపరీక్ష వచ్చింది. జపాను,అమెరికాలు హుంకరిస్తున్నవి. ఈ యుద్ధానికి సోమయాజి, చర్చిల్ ప్రధానిగా కనిపిస్తున్నాడు.

# ముఖ్యమంత్రులునిగ్రహంవహించలేరా?

గ్రానైట్ గనుల లీజు వ్యవహా రంలో ముఖ్యమంత్రి కుమారుడి పాత్ర వివాదాస్పదం కావడం, శాసన సభలో చర్చకు రావడం శోచనీయం. కుటుంబ సభ్యులను రాజకీయ రచ్చలకు దూరంగా పెట్టే నాయకుడుగా, పాపిరెడ్డి గారి మాటలలో "మిస్ట్రక్ " తగలని రాజకీయ వాదిగా జనార్దన రెడ్డి గారికి పేరుండేది. ఇప్పుడది పోయింది. ముఖ్యమంత్రిత్వపు మహత్తు ఏమిటోగాని, ఆ సీటులో కూర్చున్న ప్రతివ్యక్తి ఇటీవలి కాలంలో ఏదో ఒక అవినీతి కుంభకోణంలో కూరుక పోతున్నాడు. చెన్నారెడ్డి, అంజయ్య, భవనం వెంకట్రామ్, నాదెండ్ల, ఎన్.టి.రామారావు వంటివారందరూ ఈ ఊబిలో, చిక్కుకున్న వారే, బాధ్యతా యుతమైన ప్రజలను పాలించే మహత్తర అవకాశం కల్గిన ఈ పదవిలోకి వచ్చేవారు వ్యక్తిగత స్వార్థానికి పరిమితులు విధించుకోలేరా? అవినీతి విషయంలో కొద్దిగానైనా నిగ్రహం పాటించలరా? ఆశను అదుపు లో పెట్టుకోలేరా? ముఖ్యమంత్రి పదవి పొందడం కంటే రాష్ట్రస్థాయి నాయకులు సాధించ వలసిన ఘనత ఏముంటుంది? ఎన్ని రాశుల డబ్బు క్రుమ్మరిస్తే దానితో సమానమేతుంది? జ్యోతి బసు వంటి ముఖ్యమంత్రులను చూసి కొద్దిగానైనా నేర్చుకోకూడదా?

ఆర్.ఎం. రెడ్డి, నెల్లూరు.

### తుమ్మగుంట బ్రాహ్మలు మంత్రోపాసకులు

నెల్లూరు పట్టణ చరిత్రలో జమీన్‌రైతు వజ్రోత్సవాలు సువర్ణాక్ష రలిఖితంముగా చిరస్మరణీయంగా మిగిలిపోతాయి. ఇది తెలుగు పత్రికా సరస్వతికి జరిగిన అపూర్వ సన్మానం.

వజ్రోత్సవ సంచిక ఒక ఆణిముత్యం. చరిత్రలో దాగిన ఎంతో విజ్ఞానాన్ని, జిల్లాకు సంబంధించిన అన్ని రంగాల విశేషాలను జమీన్‌రైతు పాఠకులకు అందించడంశుభ పరిణామం.

అయితే సంచికలో శ్రీ శేషాద్రి గారు పుదూరు ద్రావిడులను గురించి

## జనవాణి

ప్రస్తావిస్తూ, తుమ్మగుంటవారు సాక శాస్త్ర ప్రవీణులని వ్రాశారు. అయితే తుమ్మ గుంట బ్రాహ్మణులు మంత్రోపాసకులు, ఆగమ శాస్త్ర అనుష్ఠాన దురంధరు లేకాక వేదవేదాంగ పండితులు కూడ.

బి.పట్టాభిరామయ్య , నెల్లూరు.

### గ్రామీణ మెడికల్ ప్రాక్టీషనర్ల గోడు

1924 లో ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ఆర్.యం.పిలకు గ్రామీణ దేశీయ వైద్యశాలలో సర్వీసు నిబంధ నలను సూచించక అగ్రిమెంటు బాండు విధానం తో ఉద్యోగాలు కల్పించారు. 58 సంవత్సరాల ఉద్యోగ రిటైర్‌మెంటు కల్పించిన ప్రభుత్వం గ్రాట్యుటీ, పెన్షన్లను వ్యతిరేకిస్తున్నది.

ఈ విధంగా వెట్టి చాకిరీ చేయించు కోవడం భావ్యమా?

మా వైద్య సిబ్బం ని ప్రభు త్వోద్యోగులు గా గుర్తించి, స్కేలు నిర్ణయించ వలసిందిగాగా విజ్ఞప్తి చేస్తున్నాను.

శ్రీరాములు , నెల్లూరు.



వేదిక పైన ముఖ్యమంత్రి సతీమణి శ్రీమతి రాజ్యలక్ష్మి, డిసిసి అధ్యక్షుడు ఆవం సంజీవరెడ్డి, జమీన్‌రైతు మేనేజింగ్ ఎడిటర్ నెల్లూరు శ్రీరామమూర్తి

# సణుగుడు

## రాజకీయ వాదుల దోపిడీకి అడ్డు పడకుంటే ప్రమాదమే

రాష్ట్రంలో, దేశంలో ఇటీవల కాలంలో జరుగుతున్న రాజకీయ పరిణామాలు, రాజకీయ వాదుల ధోరణి చూస్తుంటే సాంఘికంగా వెనుకబడిన తరగతుల వారు శాశ్వతంగా వెనుకబడే వుండేటట్లు చేయడానికి ఒక పథకం ప్రకారం కృషి చేస్తున్నారా అన్న సందేహం కల్గుతున్నది. సాంఘిక అసమానతలు వేళ్లూనుకొని, మహా వృక్షంగా ఎదగడానికి గ్రామీణ ఆర్థిక వ్యవస్థే కారణం. గ్రామం స్వయం సమృద్ధికోసం సమాజాన్ని వివిధ వర్గాలుగా విభజించి; చాకలి, కమ్మరి, కుమ్మరి, మంగలి, కోమటి వంటి కులవృత్తులను ఏర్పరచారు పూర్వీకులు. ఈ పంపకంలో వ్యవసాయంను వృత్తిగా పొందిన వారు భూములపై ఆధిపత్యం సాధించారు. అందరి కంటే అగ్రస్థానంలో బ్రాహ్మణులు వుండినప్పటికీ, వారికి అగ్రహారాల రూపేణా భూములు ఎన్నో దొరికినప్పటికీ, కౌలుదారులుగా వుండిన రెడ్డి, కమ్మ వంటి కులస్తులే వాస్తవంలో ఆ భూములను తమ స్వాధీనంలో పెట్టుకున్నారు. దున్న కలిగినంత భూమిని స్వంతం చేసుకోవడం పోయి కమతాలు విస్తరించుకొనే దశలో హరిజన, గిరిజనులను వీరు పనిమనుషులు కులంగా, పాలేరు వృత్తిదారులుగా మార్చారు. మొదట మొదట భూమి దున్నే రైతుకు, కులవృత్తులు చేసుకొనే వారికి పెద్ద ఆర్థిక అసమానత వుండేదికాదు కాని కాల క్రమంలో వస్తువుకు విలువ ధనరూపంలో నిర్ణయించే పద్ధతి ప్రాముఖ్యంలోకి రావడంతో భూమి ప్రాధాన్యత పెరిగింది. ఎక్కువ భూమి కల్గినవాడే గ్రామ పెద్దగా పరిగణింపబడే రోజులు వచ్చాయి. వ్యవసాయంపై వచ్చే ఆదాయం వారి స్వంతం కాజొచ్చింది. డబ్బు సమాజంలోని కొన్ని వర్గాలలో మాత్రమే కేంద్రీకృతమైంది. తక్కిన వర్గాల వారు వారిపై ఆధారపడ వలసిన పరిస్థితి ఏర్పడింది. సహజ పరిణామంగా డబ్బున్న వర్గాల వారు తమపై ఆధారపడే వారిపై పెత్తనం చెలాయించారు. సంపద కల్గిన వారికే మరింత సంపద సమకూరి, పేదవారు మరింత దరిద్రులై, సామాజిక అసమానతలు వ్యాప్తమై రూపు దాల్చాయి. పనిచేసేవారు పనిచేయడానికే పుట్టారన్న భ్రమ ప్రజల మనసులలో నాటుకుపోయింది. ఫలితంగా సకల అవలక్షణాలతో, అత్యంత క్రూరమైన సాంప్రదాయాల ముసుగులో సామాజిక అసమానతలు స్థిరపడి పోయాయి. భూమిని స్వంతం చేసుకొన్న కాపులు 'అగ్రవర్ణాలు' గా పరిగణనలోకి వచ్చారు. కూలి తప్ప మరొక పరుండబడే లేని ఇతర తరగతుల వారు భూమిపై పెత్తనం పొందలేక పోయారు. సవతీతి, బ్రాహ్మణులకు మాత్రం సామాజిక ఆధిపత్యాన్ని నిల్పింది.

ఒక విషవలయం వలె తయారైన ఈ సాంఘిక విపత్తులను రూపు మాపడానికి స్వర్గీయ ప్రధాని ఇందిరా గాంధీ, భూసంస్కరణల ద్వారా, బ్యాంకుల జాతీయకరణ ద్వారా, మొట్ట మొదటిసారి ప్రయత్నం చేసింది. గ్రామాలలో భూమి కల్గినవాడే గ్రామస్థాయి నాయకుడుగా ఎదిగాడు. వాడికే రాజకీయాధికారం సిద్ధించింది. రాష్ట్ర దేశ స్థాయిలో పదవులు వారి స్వంతమైనాయి. పరిపాలన వారి చేతికి వచ్చింది. రాజకీయ పగ్గాలు దొరకడంతో, మరింత విస్తృతమైన ఆర్థిక సంపద కేంద్రీకృతం చేసుకొని, తమ

డోలేంద్ర

వర్గాల ప్రయోజనాలను పదిలంగా కాపాడుకున్నారు.

గ్రామాలలోని పేదలకు భూమిపై కొద్దోగొప్పో సార్వభౌమత్వం కట్టిపెట్టడంతో, తరతరాలుగా అడుగున పడిపోయిన వారిలో ఆత్మవిశ్వాసం కల్గింది. ప్రకృతి ప్రసాదించిన వనరులలో తమకూ సమభాగం వుందన్న స్పృహ కల్గించిన తల్లి ఇందిరమ్మే! ఈ రోజు లక్షలాది గ్రామాలలో కోట్లాది హరిజన, గిరిజనాదులు అర ఎకరా, పాతిక ఎకరా భూమిని అయినా సరే, స్వంతం చేసుకొని, స్వతంత్రంగా బ్రతుక గల్గుతున్నారు. ఈ పరిణామ క్రమంలో పుట్టినవే - దళిత ఉద్యమాలు, దళితులపై అత్యాచారాలు కూడా! ఇంకెంత కాలం మేము అణిగి పడివుండాలని దళితులు ప్రశ్నిస్తే - అది ఉద్యమం అవుతుంది. ఇంతకాలం అణిగిమణిగి వుండినవారు ఇప్పుడు ఒకసారిగా మాకూ సమాజంలో సమాన హక్కులున్నాయని నిలదీసి చెప్పడం, అణగద్రొక్కుతున్న వారికి సహనం లేకపోవడంతో అత్యాచారాలు జరుగు తున్నాయి. అయితే దశాబ్దాల తరబడి జరిపిన పోరాటం వలన, మహా నాయకుల కృషివలన సామాజిక అసమానతలు తొలగిపోయే దశ వచ్చేసరికి - రాజకీయవాదులు మరొకసారి కాల చక్రాన్ని వెనుకకు త్రిప్పడానికి సాహసిస్తున్నారా అన్న సందేహం కలుగుతున్నది.

ఈ నాడు సామాజికాధిపత్యం భూస్వాముల చేతుల్లో కాదు. వారి చేతుల్లోంచి జారిన పగ్గాలు వ్యాపార వర్గాల పిడికిళ్లలో చిక్కు కున్నాయి. పారిశ్రామికవేత్తలు, వ్యాపారులు ఇప్పుడు రాజకీయ వాదులను, అధికార వర్గాలను నియంత్రిస్తున్నారు. గ్రామీణ ఆర్థిక వ్యవస్థ పతనం కావడం వల్ల రైతులు నిర్వీర్యులైపోయారు. వంద ఎకరాల భూమి వున్నవాడి కంటే టౌంకు రోడ్డులో ఒక బ్రాందీషాపు కల్గిన వాడికి ఆదాయం ఎక్కువయ్యే పరిస్థితి ఏర్పడింది. ఈ పరిణామ క్రమంలో కూడా కొన్ని వందల సంవత్సరాల క్రితం జరిగిన పొరపాటునే పునరావృతం చేసేందుకు రాజకీయవాదులు తెలివిగా ప్రయత్నిస్తున్నారు. అప్పుడు ప్రకృతి వనరులను కొన్ని వర్గాలు గుప్పెట్లో పెట్టుకుంటే, ఇప్పుడు అవే వర్గాలు పారిశ్రామిక వనరులను తమ స్వంతం చేసుకోజూస్తున్నాయి.

ప్రస్తుతమున్న పరిశ్రమలు గాని, కొత్తగా పెట్టబడుతున్న పరిశ్ర[illegible] ఎవరి ఆధిపత్యంలో ప్ర[illegible] ప్రపంచాన్ని ఎవరు శాసిస్తున్నారు? బ్యాంకులు, ఇతర ఆర్థిక సంస్థలు అందిస్తున్న సందలు, వేల కోట్ల రూపాయల ఆర్థిక సహాయం ఎవరి స్వాధీనమౌతున్నది? సమాజం మొత్తం కృషి వలన ఉత్పన్నమవుతున్న సంపద, సమాజంలోని అన్ని వర్గాలకు సమానంగా పంపిణీ అవుతున్నదా? ఈ ఉమ్మడి ఆస్తిని కొందరు మాత్రమే అనుభవించడానికి కారణమేమిటి? పరిస్థితి ఇలా కొనసాగితే ఒకనాడు భూస్వామి, భూమిలో పనిచేసే కూలిగా వుండిన అసమానత కొత్త యజమాని, అతడి క్రింది ఉద్యోగి లేదా కార్మికుడుగా మారినా మారవచ్చు. మరొక రూపంలో అసమానతలు ఏర్పడి, వెనుకబడిన తరగతుల వారిని అణగ ద్రొక్కే ప్రమాదం వుంది.

ఈ ప్రమాదం దానంతట అది రావడం లేదు. రాజకీయ వాదులు పనిగట్టుకొని సృష్టిస్తున్నారు. ప్రభుత్వ పరంగావున్న పారిశ్రామిక, ఆర్థిక [illegible] తమలోతాము లేదా కొడుకులు, అల్లుళ్ళకు కేటాయించు కొంటున్నారు; లేదా ఇప్పటికే డబ్బులో మునిగితేలే సంపన్న వర్గాలకు సమకూర్చి పెడుతున్నారు.

కొరకు 6 పేజీలో



## సెప్టెంబరైదుకాదు - ఉపాధ్యాయదినం

... కె. నారాయణ రెడ్డి

సెప్టెంబరైదుకాదు
ఉపాధ్యాయదినం.
ఉపాధ్యాయుడు
విశ్వజనశాంతికి
[illegible]చార్యుడు అవనిజనోన్నతికి
అ[illegible]రథుడై
అలరారినవా[illegible]
గురువు గురుతర బాధ్యతలు
గుర్తెరిగిననాడు
ఆనాడు, ఉపాధ్యాయుల
పర్వదినం
వినయ సంపన్నులౌ
విజ్ఞానాలకు
మనోజ్ఞభావాల
మహనీయతలకు
నీతినియమాల యుల
నవ్యజీవనాలకు
జగతిజాగృతి
జాతిభవ్యవికాసాలకు
గురువు, నీరాజనం పట్టిన ఆ
దినం
భావిబరువుబాధ్యతలకే
గురువు నడుంవంచిన దినం
ఆ దినం, ఆ సుదినం,
ఉపాధ్యాయుల దినం!
ఉపాధ్యాయనంలో
ఉపాధులు నిలిపి
సహాధ్యయనంలో
సహృదయతలు మలిపి

విద్యార్థులకు, భావిదేశ
స్వరూపా[illegible]
విద్యార్థులకు భావిజనక
సౌభాగ్య[illegible]
వివేక[illegible]
వినయసం[illegible]
నీతిబ[illegible] [illegible]
నిలకడలు
ధర్మర[illegible]
దివ్యదయా[illegible]తలు
అధ్యాపకులు [illegible]
అనుసరించి,
అవనికి ఆదర్శంగా అందరికీ
అందించిన
ఆ దినం ప్రతిదేశానికి నిజమైన
పర్వదినం
ఆ సుదినం, ఉపాధ్యాయుల
దినం
ఉపాధ్యాయుడు పృథివి
ప్రగతిపతాకం!
ఆచార్యుదుర్వికమలిన
ఆత్మవికాసం!!
ఇది, జనం, మనం, గుర్తెరిగిన
ఆ సుదినం...
ఉపాధ్యాయ దినం,
సెప్టెంబరైదు కాదు.



వజ్రోత్సవ సభావరణంలో ఆసీనులైవున్న పుర ప్రముఖులు - ఒంగోలు ఎం.పి. మాగుంట సుబ్బరామరెడ్డి, మాజీ మంత్రి ఆనం రామనారాయణ రెడ్డి, జి.ప్ర.ప చైర్మన్ డేగా నరసింహారెడ్డి, ఎమ్మెల్యేలు డాక్టర్ సుందర రామరెడ్డి, వట్రాప్ర కాశరావు, పసల పెంచలయ్య, మునిసిపల్ చేర్మన్ టి. రమేష్‌రెడ్డి, ఆనం వివేకానందరెడ్డి, గౌస్‌మోహిద్దీన్, గునుపాటి మేగొరె తదితరులు.

కావలి కాలేజిలో విధ్వంసానికి కారణం

# అటానమస్ పద్ధతిపై అసూయా? అయిష్టతా?

కావలి జవహర్ భారతి కళాశాలలో అటానమస్ సిస్టం ప్రారంభమైనప్పటినుండి ఎక్కువ మంది లెక్చరర్లు, విద్యార్థులు వ్యతిరేకిస్తూనే ఉన్నారు. పౌరుల్లోనూ విముఖత చూపారు. కాని పాలకవర్గం ధనకాంక్షచేతనో, అధికారవ్యామోహం చేతనో కేవలం పట్టుపట్టి కళాశాలను స్వయంప్రతిపత్తిని కల్పించారు. తత్ఫలితంగా మేనేజ్‌మెంట్ కు అంతరంగికులైన కొంతమందిలెక్చరర్లు కంట్రోలరు, అసిస్టెంట్ కంట్రోలరు, రిజిస్ట్రారు మొదలైన అధికారాల్లో నియమింపబడిప్రత్యేకంగా జీతాలు తీసుకోడానికి ప్రారంభించారు. దీనివల్ల అధ్యాపకుల్లో ఈర్ష్యాసూయలు తలెత్తాయి. దానికి తోడు మొన్న సంవత్సరాంతంలో జరిగిన డిగ్రీ పరీక్షల నిర్వహణలో జరిగిన అవకతవకలు విద్యార్థుల. నిర్లక్ష్యమైఖరి విద్యార్థులకు ఆగ్రహం కల్గించాయి. 26తేది డిగ్రీ విద్యార్థులేకమై అటానమస్‌ను రద్దు చేయాలని డిమాండు చేస్తూ సమ్మెచేశారు. అసిస్టెంట్ ప్రిన్సిపాల్ పాలకవర్గం పక్షాన నచ్చచెప్పడానికి ప్రయత్నించి విఫలుడయ్యాడు. పైగా ఆ సంభాషణ వారిలో ఉద్రేకాన్ని రెచ్చగొట్టడంచేత విద్యార్థులు నినాదాంతో పాటు విధ్వంసకాండను ప్రారంభించారు. దాని ఫలితంగాకెమిస్ట్రీ లేబరేటరీ, ఆఫీసు తలుపులు, ఫర్నిచరు ధ్వంసమయింది. ఆ సమయంలో ప్రిన్సిపాలు, అధ్యాపకులు బొమ్మలు మాదిరి చూస్తున్నారేకాని వారికి సమాధానం చెప్పలేక పొయ్యారు.

మేనేజ్ మెంటు పక్షాన డి.ఆర్ వచ్చి అటానమస్ రద్దుచేసినట్లు ప్రకటించారు. ఆ ప్రకటన కళాశాల బోర్డుమీద పెద్దక్షరాలతో వ్రాశారు. కాని విద్యార్థులకుఆ మాటలమీద విశ్వాసంలేక యూనివర్సిటినుండి ఉత్తర్వువచ్చేవరకు తరగతులు బహిష్కరిస్తామనిచెప్పి నిరాహారదీక్షలు సాగిస్తున్నారు. ఈవిధ్వంసకాండవల్ల కళాశాలకు లక్ష.పాతికవేలవరకు నష్టం కలిగిఉంటుందని. ప్రిన్సిపాలు గోపాలకృష్ణమూర్తి తెలియజేశారు. రాష్ట్రస్థాయిలోనే పేరుప్రతిష్ఠలు గడించిన కళాశాల నానాటికి దిగజారడం తల్లిదండ్రులకు సంతాపం కలిగిస్తున్నది.

ముఖ్యమంత్రి ప్రకటన

# "నా సతీమణే శాసన సభ్యురాలు!"

వెంకటగిరిలో తిరుపతి తిరుమల దేవస్థానం వారు ఇరవైనాలుగు లక్షల రూపాయల ఖర్చుతో నిర్మించ తలపెట్టిన కళ్యాణ మంటపానికి ముఖ్యమంత్రి శ్రీ నేదురుమల్లి జనార్ధనరెడ్డి ఆగస్టు నెల 31 వ తేదీన శంఖుస్థాపన కావించారు.

ఈ కళ్యాణమంటప నిర్మాణానికి నాలుగులక్షల రూపాయల విలువ చేసే ఒకటిన్నర ఎకరాస్థలాన్ని శ్రీ వెంకట్రామరాజా విరాళంగా ఇచ్చారు. శంఖుస్థాపన సభకు సూళ్లూరు పేట శాసన సభ్యులు శ్రీ పసల పెంచలయ్య అధ్యక్షత వహించారు. తిరుపతి తిరుమల దేవస్థానం ప్రచార విభాగం అధికారి శ్రీ ఆర్. సూర్యనారాయణ స్వాగతం పలికారు. కల్యాణ మంటపనిర్మాణం తొమ్మిదినెలల్లో పూర్తి చేయ గలమని చెప్పారు.

ముఖ్యమంత్రి శ్రీ జనార్ధనరెడ్డి మాట్లాడుతూ వెంకటగిరి ఎంతో అదృష్టం చేసి కున్నదని, తిరుపతి శ్రీ వెంకటేశ్వర్లు వెంకటగిరిపై కరుణా కటాక్షణాలు చూపుతున్నారనీ ఫలితంగా కల్యాణ మంటపం త్వరలోనే వెలయనుందనీ చెప్పారు. వెంకటగిరి నియోజక వర్గసర్వతోముఖాభివృద్ధికి జరుగుతున్న పెక్కు అభివృద్ధి కార్యక్రమాలను ముఖ్యమంత్రి వివరించారు. త్వరలో వెంకటగిరి లో స్పిన్నింగ్ మిల్లు నెల కొల్పబడుతుందని తెలియజేశారు. తనభార్య శ్రీమతి రాజ్యలక్ష్మిని శాసన సభ్యురాలిగా భావించుకోవమనీ, నియోజకవర్గప్రజలు ఆమె సేవలను వినియోగించు కోవలసిందనీ ముఖ్యమంత్రి కోరారు. కల్యాణమంటపనిర్మాణ స్థల దాత శ్రీ వెంకట్రామ రాజాగారిని ప్రత్యేకంగా సత్కరించి, సన్మానించి అభినందించారు.

ముఖ్యమంత్రి సభలో రాపూరు శాసన సభ్యులు శ్రీ నువ్వుల వెంకటరత్నం నాయుడు ఉపన్యసించారు. ప్రకటించిన ప్రకారం దేవాదాయ శాఖ మంత్రి శ్రీ పంతం పద్మనాభరావు హాజరుకాలేదు. జిల్లా కలెక్టర్ శ్రీ కె.రాజా, జిల్లా అభివృద్ధిశాఖాధికారి శ్రీ సతీష్ చంద్ర తదితర అధికారులు సభలో పాల్గొన్నారు.




### శ్యాం పేపర్ ప్రారంభం

గూడూరు సమీపంలోపిరెటర్‌సత్రం వద్ద ప్రముఖ పారిశ్రామిక వేత్త శ్రీ అల్లారెడ్డి శ్యామ సుందరరెడ్డి 16 కోట్ల రూపాయలతో నిర్మించిన వాల్ పేపర్ తయారీ పరిశ్రమకు ముఖ్యమంత్రి శ్రీ జనార్ధనరెడ్డి ప్రారంభోత్సవం చేశారు.

ఈ పరిశ్రమకు రాష్ట్ర పారిశ్రామికాభివృద్ధి సంస్థ ఒకటిన్నర కోటి రూపాయలను రుణంగా యిచ్చిందని ముఖ్యమంత్రి తెలియజేశారు.

ప్రారంభోత్సవ సభకు సాంకేతిక విద్యాశాఖామంత్రి శ్రీ గురునాధరావు అధ్యక్షత వహించారు. శ్రీ మాగుంట సుబ్బరామిరెడ్డి, కుమారి పద్మశ్రీ, డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి, శ్రీ జె.కె. రెడ్డి, శ్రీ వట్రా ప్రకాశరావు, కలెక్టర్ శ్రీ.కె.రాజా, శ్రీ వేమారెడ్డి రామచంద్రారెడ్డి ప్రభృతులు సభలో పాల్గొన్నారు.

### చిన్న విషయానికి పెద్దరగడ

ఇది గూడూరు మునిసిపల్ కౌన్సిల్ మీటింగ్ లో జరిగిన గందరగోళ

కొరవ 8 పేజీలో

## ● ఉత్తరక్రియలు ●



మా తండ్రి బొమ్మెన చెంచయ్య శెట్టిగారు

గిద్దలూరు

24.8.91 తేది శనివారం సర్గస్థులైనారు. వారికి శ్రద్ధంజలి ఘటిస్తూ, వారి ఉత్తర క్రియలు 8.9.91 తేది శనివారం పెదకర్మ 9.9.91 తేది ఆదివారం బ్రాహ్మణ బియ్యాలు గిద్దలూరులోని మా స్వగృహమున జరుగును. బంధు మిత్రులు తెలియ గోరు తున్నాము.

భార్యలు : రమణమ్మ, సుబ్బమ్మ

కుమారులు కోడళ్ళు : రాధాకృష్ణయ్య - రమణమ్మ, సురేష్

కుమార్తెలు అల్లుళ్ళు : గునుపాటి సీతాలక్ష్మి - శేషగిరి; బిమ్మెన ధనలక్ష్మి

మనమడు మనుమరాలు : గునుపాటి సుప్రియ, భరత్‌కుమార్, బొమ్మెన ప్రవీణకుమార్

## నోటీసు

కనిగిరి డిస్ట్రిక్ట్ మున్సిఫ్ వారి కోర్టులో E.P. 30/83 in o.s. 456/78 సర్వాపురం DMC

ఈ నంబరు E.P. షెడ్యూలు ఆస్తిని హైకోర్టువారి ఎదుట 17.9.91తేది 10.30గంటలకుయాలం వేయబడును. పాటదారులు పాటలో పాల్గొన వచ్చును.

షెడ్యూలు

1. కనిగిరి తాలూక బొల్ల గూడూరు మజరా అప్పమాంబాపురం గ్రామము సర్వే నెం. 236/1 య 2- 28 బ్లు మాగాణి భూమికి హద్దులు తూర్పు; తెలజాల నాగయ్య భూమి; దక్షిణం: భట్టుపల్లి నారాయణ భూమి; పడమర : బొమ్మినేని వెంకటయ్య ,భూమి; ఉత్తరం: యారశింగు వెంగయ్య భూమి యీ హద్దులలోని యీ 2-28బ్లు లేక 0. 831 హె మాగాణి భూమి ఈ భూమికి రుదలయ్యే పంట కాల్వలు వగైరా ఈజిమెంటు హక్కులు

DHr క్రయం రు 3,300/-

ఆమీనా క్రయంరు 9,000/-

2. డిటో గ్రామము సర్వే 239/1 య 0-48 బ్లు మాగాణి భూమికి హద్దులు తూర్పు: చుంచు నరసింహం భూమి; దక్షణం- పడమర: తెలజాల నాగయ్య భూమి ఉత్తరం : యార్రశింగు వెంగయ్య భూమి యీ హద్దులలో య 0-48 బ్లు లేక 0-194 హె గం మాగాణి భూమి.

DHr క్రయం రు. 500/-

ఆమీనా క్రయంరు. 2,000/-

3. - డిటో- గ్రామము సర్వే 244/ 9రు య 0-32 సెంట్ల మాగాణి భూమికి హద్దులు తూర్పు - గవర్నమెంటు దారి దక్షిణం- దిబ్బల పోరంబోకు పడమర - బొమ్మినేని చంచయ్య భూమి ఉత్తరం - బొమ్మినేని వెంకటయ్య భూమి ఈ హద్దులలో య 0-32 బ్లు లేక 0.129 హె గం మాగాణి భూమి ఈ భూమికి గం పంట కాల్వలు దార్లు వగైరా ఈజిమెంటు హక్కులు .

DHr క్రయం రు. 500/-

ఆమీనా క్రయం రు. 800/-

వెన్నెలగంటి విజయ శ్రీనివాస మూర్తి

DHr అడ్వకేటు

# నెల్లూరు గుబ్బల్లో
## విమర్శకుడు

### మొలగొలుకు మద్దతు ధర పెరిగింది!

మొలగొలుకు మద్దతు ధర ఈ సంవత్సరం క్వింటాల్‌కు ఇరవై అయిదు రూపాయల వంతున పెంచబడింది. పెంచిన ధర ప్రకారం మొలగొలుకు ఐ.ఆర్. 20 ఐ.ఆర్.64 పుట్టిదర, దిగువ ఇస్తున్నాము.

మొలగొలుకు 1955/-రూ

ఐ.ఆర్.20 2040/ రూ

ఐ.ఆర్ 64 2125/- రూ

ప్రభుత్వ దృష్టిలో మొలగొలుకు మీన్నాం క్వాలిటి ఒకటే; అందువలన ధర కూడా ఒకటే పెంచిన ప్రకారం సున్నాం మద్దతు ధరకు-డ పుట్టి 1950/-రణలే.

గత సంవత్సరం మొలగొలుకు కు మద్దతు ధర క్వింటాల్ కు 15/- మాత్రం పెంచబడింది. దాని ప్రకారం పుట్టి 1742/-రూ అయింది. సజ్జ, జొన్న, వేరుశెనగ, వగైరాల మద్దతు ధరలు కూడా, పెంచబడ్డాయి. "పెంచిన ప్రకారం క్వింటాలుకు సజ్జ, జొన్న, రాగి 205/-రూ వేరుశెనగ 880/-రూ. వీటికి సంబంధించి గత సంవత్సరం మద్దతు ధరలు సమయానికి లభ్యం కాలేదు. రైతులు పల్లె ప్రజలు అని కలవరిస్తూ ఆ ప్రజల తరపున చాంపియన్‌గా చెప్పుకొంటుండిన శ్రీ దేవీలాల్ పెంచిన ధర కంటే శ్రీ బలరామ్ జక్కర్ పెంచిన ధర ధాన్యానికి సంబంధించి రెట్టింపు. అందువలన కాంగ్రెస్ ప్రభుత్వం పూర్వం ఎన్నడు పెంచనంతగా పెంచినందు వలన దిన పత్రికలన్నీ సత్సృప్తిని వెల్లడించాయి. అభినందించేయి. ఎరువుల ధర పెరుగుదల కు ధాన్యం ధర పెంచడం ద్వారా ప్రభుత్వం రైతుకు కాస్త ఉపశమనం కల్గించిన దని అభిప్రాయం వెలిబుచ్చినాయి. కాని మద్దతు ధర ఎంత ఎక్కువగా పెంచినా మార్కెట్ ధరకు దానికి మధ్య అంతరం ఎక్కువగా వుంటున్నది. ఇతర ఖర్చులకు అనుగుణంగా వుండటంలేదు. గుడ్డిలో మెల్ల శ్రేష్ఠరోన్నలు ఒక్కసారి ఇంత ఎక్కువగా పెంచినందుకు అయినా సంతోషించాలి. రైతు పక్షపాతి. శ్రీ బలరామ్ జక్కర్ వ్యవసాయ మంత్రిగా వున్నందు వల్లనే ఇది సాధ్యం అయినది. పి.వి ప్రభుత్వానికి రైతుల పక్షంగా కృతజ్ఞతలు వెల్లడిస్తున్నాము.

### స్టాండర్డ్ పాకేజింగ్ రజతోత్సవం

ఇండస్ట్రియల్ ఎస్టేట్ లోని స్టాండర్డ్ పాకేజింగ్ మాతృసంస్థ "బ్లిస్ గ్రూప్" రజతోత్సవం 2తేది మద్రాసులో జరిగింది. ట్యూబ్ ప్రొడక్ట్స్ ఆఫ్ ఇండియా ఎం.డి. శ్రీ ఎం.వి అరుణాచలం, ఎంఆర్ఎఫ్ జనరల్ మేనేజర్ శ్రీ కె ఎస్ రావు, కెనరా బ్యాంకు డిజియం శ్రీ ఎ.ఎం ప్రభు తదితరులు పాల్గొన్నారు. సహృదయ మిత్రుడు శ్రీ గోరంట్ల రాధాకృష్ణ ఈ కంపెనీ సారథులలో ఒకడు

### ఉత్తమ అధ్యాపకుడు శ్రీ. నారాయణ రెడ్డి



మనుగు జూనియర్ కాలేజి ప్రిన్సిపల్ /, కె. నారాయణ రెడ్డి, యం.ఏ. య .ఇడి. ఉత్తమ ఆచార్యుడిగా 5వ తేది రాష్ట్ర ప్రభుత్వ పురస్కారాన్ని అందుకున్నాడు.

శ్రీ నారాయణ రెడ్డి అధ్యాపకుడే కాదు భావ కవి కూడా. ఉద్యోగ ధర్మాన్ని పరమ పవిత్రంగా ఎంచి చిత్త శుద్ధితో పనిచేస్తూ తాను పనిచేస్తే విద్యా

కొరవ 7 పేజిలో

### సణుగుడు

(4పేజి కొరవ)

మన రాష్ట్రం సంగతే తీసుకొండి. గత పాతికేళ్లలో ,వివిధ ప్రభుత్వాల పాలనలో జరిగిన గోల్మాళ్లు, స్కాములు అక్రమార్జనలు దోపిడీలలో ఒక్కవెనుక బడిన తరగతులకు చెందిన లేదా హరిజన గిరిజనులకు చెందిన పేర్లు విన్నామా? గుడిసెలు వేసుకున్న హరిజన నాయకుడో, మంత్రిత్వాలు వెలగ పెట్టిన ఏ వెనుక బడిన తరగతుల నాయకుడో ఎప్పుడో ఒకప్పుడు దోపిడీలో పేరు పొంది వుండవచ్చు. కాని టిక్కట్ కాంట్రాక్టుల ద్వారా . సారాయి అవకతవకల ద్వారా. గనుల గుటకాయ స్వాహాంద్వారా, దొంగ క్లైమ్‌ల దిగమింగుడు ద్వారా, ప్రపంచ బ్యాంకు కాంట్రాక్టులు కొల్లగొట్టడం ద్వారా, పులికాట్ సరసులను వాతాపి జీర్ణం చేయడం ద్వారా, నాచారం , గండిపేట ఆశ్రమాలు నిర్మించడం ద్వారా, ఇంకా పలురకాల మార్గాల ద్వారా , ప్రభుత్వంపై ఆధారపడిన ఆర్థిక సంపద, ప్రకృతి వనరులు ఎవరి స్వాధీనంలోకి పోతున్నాయి?

ఉద్యోగ వర్గాలు ,వ్యాపార వేత్తలు రాజకీయ వాదులు, ఒక త్రివిధ్య కూటమి గా ఏర్పడి, వందలు, వేల, కోట్ల రూపాయల సంపదను తమ హస్తగతం చేసుకుంటుంటే, సాధారణ పౌరుడు, బడుగు రైతు, దళితులు, వెనుకబడిన తరగతుల వారు గుడ్లు అప్పగించి చూస్తూవుండవలసిందేనా? సంపదంతా కొన్ని వర్గాల చేతిలో కేంద్రీకృతమైతే, మరొక సారి, మరొక రూపంలో సాంఘిక అసమానతలు తలెత్తడం ఖాయం కాదా?

ఒక రాజకీయ వాది, లేదా ఉన్నత అధికారి తన అల్లుడికో, కొడుకుకో, ప్రభుత్వ ఆస్తి పంచిపెడుతుంటే అది అన్యాయం అని నిరసించాల్సిన బాధ్యత, హక్కు, ప్రతి పౌరుడికి వుంది. రాజకీయ వాదుల కుటుంబ సభ్యులు వ్యాపారం చేయకూడదని నేను అనను. అయితే ఓట్ల ద్వారా ప్రజలు కట్టబెట్టిన అధికారాన్ని దుర్వినియోగం చేసి ఆ అధికార వర్గాలు ప్రభుత్వ ఆస్తులను అక్రమంగా తమకొసం బదలాయించడం మాత్రం సహించ రాని నేరం. ఒక సాధారణ పౌరుడి వలె రాజకీయ వాది కొడుకు కూడా వరుసలో నిలబడి, అర్హత చూపి, ప్రతిభ ప్రదర్శించి వ్యాపారాలు చేయవచ్చు; పరిశ్రమలు నడుప వచ్చు. ఆ పద్ధతి తప్పితే ఎంతటి వాడైన ప్రజా న్యాయ స్థానము ముందు దోషిగా నిలబడక తప్పదు.

ఎం.ఎల్.ఏ. టిక్కెట్ల కోసం, మంత్రి పదవుల కోసం, తన్నుక చచ్చే వెనుక బడిన తరగతుల నాయకులు, దళిత జనోద్ధారకులు ఆర్థిక పరంగా జరుగు తున్న ఈ ప్రమాదాన్ని ఎందుకు గ్రహించడం లేదు? ఎం.ఎల్.ఏ టికెట్లు ఇవ్వాలంటే "ఎంత ఖర్చు పెట్టుకో గలడు" అనే ప్రశ్న ప్రధాన పరిశీలనాంశంగా మారిపోతున్నపుడు, సంపద అంతా కొందరి చేతుల్లోనే కేంద్రీకృతమైతే, వెనుక బడిన తరగతుల వారికి భవిష్యత్తులో రాజకీయ అధికార ఆశించే అవకాశం దొరుకుతుందా?

డబ్బు ఖర్చు పెట్టి అధికారంలోకి వచ్చి, ఆ అధికారం అడ్డం పెట్టుకొని మరింత డబ్బు సంపాదించి ఆ డబ్బుతో మళ్ళీ అధికారం పొందాలనుకునే రాజకీయ వాదుల బారి నుంచి సమాజాన్ని రక్షించు కోకుంటే - చరిత్ర పునరావృత మౌతుంది. ఫాసిజం రోజుల నాటికి కాలచక్రం వెనుకకు తిరుగుతుంది.



వజ్రోత్సవాలకు ఆహ్వానం పల్కుతూ వి.ఆర్. కాలేజి కూడలిలో నెలకొల్పిన స్వాగతద్వారం.

## సందేశాలు

(12పేజి కొరవ)

ము ముంత్రినీ ఒకే వేదిక మీదికే చేర్చగడం ముదావహం. మీ వజ్రోత్సవాలు విజయవంతం కావాలని, నా శుభాకాంక్ష లందిస్తున్నాను. మీ పత్రిక వందేళ్ల పూర్తిచేసుకొని ఇంతకన్నా ఘనమైన వేడుకల్ని జరుపుకోగలదని ప్రగాఢంగా విశ్వసిస్తున్నాను.

...కె. ఆదిశేష గుప్త
గుడివాడ :: సబ్‌జడ్జి

### గర్వకారణం

ఒక వారపత్రిక వజ్రోత్సవానికి, దేశతొలి పౌరులు, గౌరవనీయులైన రాష్ట్రపతి విచ్చేయడం సింహపురికే గర్వకారణం. ఈ కార్యక్రమం జయప్రదం కావాలని, మున్ముందు మరింతగా ప్రజల ఆదరణను పొందుతుందని ఆశిస్తున్నాను.

...ఎ. జగదీష్
రోమ్

### రైతు గొంతుకగా...

నెల్లూరు జిల్లా వెంకటగిరిలో ప్రప్రథమంగా జమీన్‌రైతు ఉద్యమం శ్రీ యన్.జి. రంగా గారు నాయకులుగా శ్రీ కటికనేని కళ్యాణరావుగారి నాయకత్వాన ప్రారంభించిన శుభదినాన కీర్తిశేషులు నెల్లూరు వెంకట రామా నాయ డు గారు "జమీన్‌రైతు" పత్రిక ప్రారంభించి రైతుహక్కుల రక్షణకు కార్యక్రమం ప్రచారం జరిపి

బ్రిటీష్ ప్రభుత్వ హయాంలో రైతు రక్షణ కొరకు పోరాడి కీర్తిపొందినారు 1948 సంవత్సరంలో జమీందారీల రద్దును సాధించి విజయం పొందగలిగినారు.

మీరు రాష్ట్రపతి శ్రీ వెంకటరామన్, ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ యన్. జనార్ధనరెడ్డి, జమీన్‌దారీ ఉద్యమ నాయకులు శ్రీ ఎన్.జి. రంగా, కాంగ్రెస్ నాయకులు, పూజ్యులు శ్రీ బెజవాడ గోపాల రెడ్డి వగైరా పెద్దలందరి ద్వారా మీరు జరుపుకున్న జమీన్‌రైతు వజ్రోత్సవాలు విజయవంతమగుగాక!

...పాదిలే వెంకటస్వామి రెడ్డి
వెంకటగిరి టౌన్

---

మహారాజశ్రీ విజయవాడలోని 2వ అదనపు జిల్లా మున్సిఫ్ వారి కోర్టులో

O.P 41 of 1991

మధ్య

సింగలూరి అనసూయమ్మ...పిటీషనరు

మరియు

1. జంపుల సుబ్బయ్య...

2.జంపుల ధనలక్ష్మి .....రెస్పాండెంట్లు

ఈ పై నెంబరు పిటీషనులో, పిటీషనరు పంజాబ్ నేషనల్ బ్యాంకులో, సింగలూరి వెంకటసుబ్బయ్య మరియు జంపుల వెంకట గంగాధరరావు గార్ల పేరు మీదనున్న ఫిక్సెడు డిపాజిట్లను తీసుకొనుటకు వారసత్వపుసర్టిఫికెటు కొరకు పిటీషను దాఖలు చేయగా, సదరు కోర్టు వారు 27.9.91 తేదీకి వాయిదా వేసియున్నారు. సదరు పిటీషనులో యెవరికైన యెట్టివైన ఆక్షేపణలున్న యెడల పైతేదీన ఉదయం గం 10.30 నిII హాజరై పై కోర్టు నందు తెలుపు కొనవలయును. లేని యెడల పరోక్షమున తీర్మానించబడును.

ఇట్లు
వెలివల రామ్ ప్రసాద్
పిటీషనరు తరపు న్యాయవాది.



## ఉత్తర క్రియలు

మా తండ్రి

కొండూరు సుబ్బారెడ్డిగారు

స్వర్గస్థులైనారు తే 29-8-91 ది గురువారం వేకువజామున గం॥ 2.30

తే 13-9-91 ది శుక్రవారం పిలుపు, తే 14-9-91 ది శనివారం ఎత్తు ంపు

సుబిస్తి హాలులో మా స్వగృహమందు జరుగును. బంధుమిత్రులు తెలియ గోరుచున్నాము

కొండూరు రాధాకృష్ణ రెడ్డి, జనార్ధనరెడ్డి, శ్రీహరిరెడ్డి

చంద్రమోహన్ రెడ్డి, హరినారాయణ రెడ్డి, కరస్పాండెంటు - విద్యానికేతన్.

---

(6పేజి కొరవ)

సంస్థ పున్నతికి కృషి చేసే వ్యక్తి. ఉత్తమ ఆచార్యుడు శ్రీ నారాయణ రెడ్డికి మా అభినందనలు.

## అమెరికాలో నెల్లూరు అమ్మాయి ప్రతిభ



మైపాడుకు చెందిన స్వర్గీయ నారపరెడ్డి రంగారెడ్డి మనమరాలు సురేఖ స్కూలు విద్యలో అమెరికా కంతటకి ప్రథమురాలుగా ఉత్తీర్ణురాలై, ప్రతిష్ఠాకర మైన ప్రెసిడెంట్ ఆఫ్ అమెరికా అవార్డు పొందింది. ఆమె ప్రతిభను అమెరికన్ పత్రికలు కథలు కథలుగా వర్ణించాయి. ఆమె స్కూలులో విద్యార్థి సంఘం కార్యదర్శిగా, టెక్సాస్ అసోసియేషన్ ఆఫ్ జూనియర్ సంస్థకు అధ్యక్షురాలుగా కూడా పని చేస్తున్నది.

సురేఖ శ్రీరాజగోపాల రెడ్డి కుమార్తె. ఆయన 32 సంవత్సరాల క్రితం నెల్లూరు వదలి అమెరికాలో స్థిరపడ్డాడు. నెల్లూరు జిల్లా కీర్తి పతాకను అమెరికా గగనంలో రెపరెప లాడించిన సురేఖ కు మా అభినందనలు

### వజ్రోత్సవ సంచిక పంపాము

జమీన్ రైతు వజ్రోత్సవ సంచిక సర్టిఫికేట్ ఆఫ్ పోస్టింగులో మా చందా దారులందరికీ పంపాము చేరచూచుకో ప్రార్థన.

- మేనేజర్ జ.రై

## ఎల్ .వి .విజయం

రిమోట్ కంట్రోల్‌తో కార్మిక సంఘాలను నియంత్రించే రాబోట్ ఎల్ వి కృష్ణారెడ్డి దగ్గరున్నట్లుంది. కాపురం హైదరాబాదులో; వ్యాపారమూ అక్కడే అయినా లయన సారధ్యంలో నడిచే కార్మిక సంస్థ విప్పో ఫ్యాక్టరీలో గుర్తింపు పోటీలో గెలుపొందింది. ఇది ఐఎన్ టియుసి అనుబంధ సంస్థ.

## మరణం

శ్రీ అత్తి వరపు వెంకట దశరధ రామిరెడ్డి (73) 30 వ తేది దివంగతులైనాడు. ఆయనకు ఒక భార్య

ఇద్దరు కుమారులు, ముగ్గురు కుమార్తెలు. ఆంధ్ర బ్యాంక్ జనరల్ మేనేజరుగా మద్రాసు వున్న శ్రీ జి. రామకృష్ణ రెడ్డి ఆయన పెద్దల్లుడు అప్పటికి మైనర్ అయిన మోహనమ్మను "రుక్మిణి" కల్యాణం ద్వారా సంచలనం సృష్టించిన వ్యక్తి శ్రీ దశరథ రామ రెడ్డి 45 ఏళ్ళ క్రితం ప్రసిద్ధుడు. మాదరాజ గూడూరు' రావుసాహెబ్ అత్తి వరపు వెంకట రామి రెడ్డి పెద్ద కుమారుడు దశరథ రామి రెడ్డి కుటుంబానికి మా సంతాపం తెలియ చేస్తున్నాము.

### నెల్లూరు బజారు

మొలగొలుకులు :

| | | |
|---|---|---|
| | 9672 పుట్టి 2600 | |
| | 9674 | 2500/-రూ |
| వి.ఆర్. 20 | | 2400/- |
| వి.ఆర్.64 | | 2250/- |
| సున్నాలు | | 2200/- |

# శివారెడ్డి పద్యాలు

### జమీన్ రైతు పత్రికోత్సవము

నిన్నటినిన్నాను పత్రికోత్సవమ్ముగా
జరుపుము గురించి సాటిసాటి
ప్రకటించి నిజము ఉద్యాన బూసాలు
పెట్టిపెట్టలేలు చెప్ప కళ్ల
పెళ్లయినం బ్రాకె నెల్లూరు జిల్లాన
బ్రతికెకి చిన్న పత్రికయినది.
వార్త పత్రికలకు పత్నిజేకూర్చింది
ఎంతగానో జమీన్ రైతు!
నిన్ను చెరియబోడు, నీపేరు వినబోడు.
ఆంధ్రరాష్ట్రమందు అట్టెలేడు.
యేమి నిన్ను గూర్చి చెప్పిన వ్రాయుచున్న
ప్రాప్తలోక్ష్మి ప్రైము కోర్టి, సెంప్

### వెంకట్రామానాయుడు

అదివాళ్లనమునుపు పాడలు వెంకట్రామ
నాయుడంటె ఆయన పేరు వింటె
తిరుగులేదు అయ్యనీర్పైనె. మాటంటె
అది మంచి కవికి అన్ని దెలుసు.

రచ్చ కీర్చువాడు రాజాధిరాజుల్ని
పేదసాదరైతు బాధమాన్పి
వాడు, నాయుడంతవోడు యీజిల్లాలో
పుట్టడింక, పుడితె వొట్టుబెట్టు!

ఎంతమంది బుల్ల ఎంతరెందరులోల
పత్రికారివతులు పైన పైన.
నీదు నీతినిష్ఠ నీ పేరు నీకూర్చు.
రామానాయుడు! నీదురకమువేరు

### రాష్ట్రపతి, ముఖ్యమంత్రి

ముఖ్యమంత్రి నీవె ముందంజ వేసింది
ఆంధ్రప్రగతి రోజనిలముగొంది.
పయురాజు రాష్ట్రపతి! నీవె అలింద్య
ప్రష్ట వ్రాసె అకాశముకు

నిప్పునిప్ప పున్న దున్నట్లు నివర!
తేరకోపై. వ్రాస్తి. తెలియజేస్తి.
మాకుదెలుసు. కడుపుమంట ఏంటేసిరి.
కలము వేరు దాని కల్పరేరు.

### నండూరికి అవార్డు

మాజమీన్ రైతు రామానాయుడుఅవార్డు
అందుకొంటె దానికర్హుడీవు.
నీదు ఆంధ్రజ్యోతి నిండు పున్నమిరేయి
ప్రతిదినీదురచన పాలకోవ!

### ఆచార్య రంగ

రైతుబాంధవుల్లో రంగాను నిను జూచి
కలుసుకోని ఎంతో కాంక్షైందో.
కౌగలించినావు. కరచాలనము జేసి
ఆదరించినావు. అంతెచాలు.

### మంత్రి మాదాల

మాకు దేవికయ్య మాదాల. పూమాల
మొయ్యరాని బరువు ముఖ్యమైన
విషయమొక్కటుంది వివరిస్త. హాకరోజా
అడదాక వస్త. అందజేస్త!



## జిల్లా వార్తలు

(5 వ పేజీ తరువాయి)

విషయం! దాని వివరాలిలా ఉన్నాయి. గూడూరు పురపాలక సంఘంలో పనిచేస్తున్న చనిపోయిన ఎ.వి. ప్రసాదరావు పురోగ్యాన్ని ఆయన భార్య పాలిపాటి పోలమ్మకు ఇచ్చేవిషయంపై యీ రగడ జరిగింది. మునిసిపాలిటీలో ఒక ఆయా ఉద్యోగం ఖాళీగా ఉంది. కానీ ఆ ఉద్యోగం యివ్వాలంటే అభ్యర్థికి కనీస వయోపరిమితి 30 సంవత్సరాలు. పోలమ్మవయసు 25 సంవత్సరాలు. కాబట్టి పోలమ్మ ఆఉద్యోగానికి అర్హురాలు కాదని కొందరు కాంగ్రెస్ వాదులు వాదించగా శ్రీ ఎల్లసిరి గోపాలరెడ్డి మరికొంతమంది కౌన్సిలర్లు ఆమెకు ఆయా ఉద్యోగం ఇవ్వవచ్చుననీ, ఆ నియామకానికి ఇంతకే ముందు మునిసిపల్ సమావేశం తీర్మానించిందని వయసు పరిమితి సడలింపును కోరుతూ ప్రభుత్వానికి విన్నవించిందనీ. మన ముఖ్యమంత్రి జనార్ధనరెడ్డి గారు ఇదివరలో విద్యాశాఖమంత్రిగా ఉన్నప్పుడు పోలమ్మ విషయమై మునిసిపల్ అడ్మినిస్ట్రేటివ్ డైరెక్టరుకు వెంటనే తగిన చర్యలు తీసికోవాలని వ్రాశారనీ వాదించారు. ఈ విషయంలో కాంగ్రెసు కౌన్సిలర్ల మధ్య వాదోపవాదాలు చెలరేగాయి! ఒక దురదృష్టవంతు రాలికి సాయంచేసే విషయంలో కూడా రాజకీయాలు, రచ్చలు! ఇది గూడూరు పురపాలక సంఘనిర్వాకం.

### చిల్లకూరు పోలీస్ స్టేషన్ దుస్థితి

గూడూరు సమీపంలోని చిల్లకూరు పోలీస్ స్టేషన్ ను ప్రారంభించారే గానీ, అందుకు తగినంతమంది సిబ్బందినిగానీ వారికి సరైన వసతులు గానీ ఏర్పాటు చేయలేదు. టెలిఫోన్ సౌకర్యము లేనందున అత్యవసరసమయాలలో ఇబ్బంది పడాల్సి వస్తున్నది. సిబ్బందికి గృహవసతి కల్పించబడలేదు. ఐదుగురు కానిస్టేబిళ్లు ఉన్నా ఇద్దరికి ఎప్పుడూ బయట పనులుంటాయి. మిగిలిన ముగ్గురితో విధినిర్వహణ కష్టంగా ఉంటున్నదని సబిన్‌స్పెక్టర్ తెలియజేశారు. ఎస్.పి.గారు ఈ విషయంలో శ్రద్ధవహించుకుంటారని ఆశిస్తున్నాం.

### వెంకటగిరిలో సినిమా షూటింగ్

వెంకటగిరిలో యీనెల ఒకటో తేదీ నుండి లక్ష్మీ ప్రసన్న పిక్చర్స్ ఆధ్వర్యములో నటుడు మోహన్ బాబు నిర్మిస్తున్న " రౌడీగారి పెళ్ళాం" సినిమా షూటింగ్ రాజాగారి పాలెస్ లో జరుగుచున్నది. ఈషూటింగ్ నాలుగవ తేదీకి ముగుస్తుంది.

వెంకటగిరి ఆబాల గోపాలం వేలం వెర్రిగా యీ షూటింగ్‌ను చూస్తున్నారు. సినిమా సందడితో వెంకటగిరికి కొత్త కళొచ్చింది.

జమీన్‌రైతు రామానాయుడు అవార్డును ఆంధ్రజ్యోతి సంపాదకుడు నండూరి రామమోహన రావుకి అందజేస్తున్న ముఖ్యమంత్రి.



ప్రమోషన్ పై డిప్యూటీ మేనేజరుగా విజయవాడ వెళ్ళిన శ్రీ జె.జె.రెడ్డి గారిని 27-8-91 తేది హోటల్ సింహపురిలో నెల్లూరు జిల్లా ఇండియన్ ఆయిల్ డీలర్లు అభినందంచి సన్మానించి నపుడు కృతజ్ఞతలు తెలుపుతున్న శ్రీ జె.జె.రెడ్డి

# మధ్యలో దర్శకుని మార్పు

డాక్టర్ రాజశేఖర్ హీరోగా నవదర్శకుడు గుణశేఖర్ దర్శకత్వం వహించే 'ఏవడైతే నాకేంటి' చిత్రం షూటింగ్ మందకొడిగా సాగుతుందని నిర్మాతలు సూరెడ్డి వెంకటేశ్వర రావు, కృష్ణారావు, ఆ యూనిట్‌లోని ఇతరులు అభిప్రాయ పడ్డారట. దర్శకుడు రోజుకి రెండో మూడో షాట్స్ తీస్తుంటే ఆ చిత్రం పూర్తయ్యేదెన్నటికి? బొంబాయి నటి తపస్వి పదిరోజుల పాటు హైదరాబాద్‌లో వుంటే షూటింగ్‌లో ఒకే ఒక రోజు పాల్గొన్నదట. పైగా, దర్శకుడు ఒక వాన పాట చిత్రీకరించడానికి హైదరాబాద్‌లోని తొమ్మిదంతస్తుల భవనం మీద ప్రత్యేకంగా సెట్ వేయాలని పట్టుపట్టాడట. రాజశేఖర్, ఆయన సతీమణి జీవిత ఎంత నచ్చజెప్పడానికి ప్రయత్నించినా ఫలితం లేకపోయింది. గుణశేఖర్ తప్పుకుంటూ నన్నాడట. దానితో ఈ చిత్రానికి కథ, స్క్రీన్‌ప్లే సమకూర్చిన జీవిత దర్శకత్వంలోనే పూర్తి చేయడానికి సంకల్పించారు. అప్పుడు తపస్వికు బదులు శిల్పాను బుక్ చేసి, తీసిన భాగాన్ని మళ్లీ రీషూట్ చేయాలన్నదట జీవిత. ఈ చిత్రంలో చీఫ్ మినిష్టరుగా జయప్రద ఒక ప్రత్యేక పాత్రలో కనిపిస్తుంది. ఇళయరాజా సంగీత దర్శకుడు.

## ముచ్చర్ల అరుణ బ్యూటీపార్లర్

నటి ముచ్చెర్ల అరుణ వివాహమయ్యాక సినిమా రంగానికి దూరమైంది. ఆమె మద్రాసు ఎగ్మూర్‌లోని పల్లవి హోటల్‌లో "ది అంబాసిడర్ హెల్త్ స్పాట్" అనే బ్యూటీ పార్లర్‌ను ప్రారంభించింది. ఇందులో పురుషుల విభాగానికి చిరంజీవి, మహిళల విభాగానికి శ్రీదేవి చేతుల మీదుగా ప్రారంభోత్సవం చేయించింది. విజయనిర్మల కూడా తన నవీన్ ఇంటర్నేషనల్ హోటల్‌లో ఇదివరకే తన పేరున ఒక బ్యూటీపార్లర్‌ను ప్రారంభించింది.

**మద్రాసు సినిమా వార్తలు**

## ఎం.ఎస్. ఆర్ట్ మూవీస్ "తెగింపు"

అమెరికాలో ఉన్నత విద్య అభ్యసించి వచ్చిన ఎం. శ్యామ్‌ప్రసాద్ రెడ్డి నిర్మాతగా ఆయన జనకుడు, సహజకవి మల్లెమాల సుందరరామి రెడ్డి సమర్పించే ఎం.ఎస్. ఆర్ట్ మూవీస్ చిత్రాలంటే ప్రజలకు ఏంతో క్రేజ్ ఉంది. కథను ఎన్నుకోవడం నుంచి అన్ని ఘట్టాలలో ప్రత్యేక శ్రద్ధ కనబరుస్తారని ఈ సంస్థ ఇదివరకటి చిత్రాలు రుజువు చేశాయి. తాజా చిత్రం "తెగింపు"లో రాజశేఖర్, అమల నాయకానాయికలు. మాటలు : పరుచూరి బ్రదర్స్, దర్శకత్వం: కె.ఎస్. హరి. సెప్టెంబరు మూడవ వారంలో విడుదలకు సన్నాహాలు జరుగుతున్నాయి. ఈ చిత్రం వసూళ్లలో ఈ సంస్థ ఇదివరకటి చిత్రాలను అధిగమించగలదని అనేకుల విశ్వాసం.

## అగ్నిలున్నారు జాగ్రత్త

"నక్సలైట్లు ఎవరు, వాళ్ళలా మారడానికి గల కారణాలేమిటి అన్న ప్రాతిపదికపై తయారవుతున్న చిత్రం" అన్నారు జె. రామ కృష్ణ. ఈయన కథ, మాటలు, పాటలు, దర్శకత్వంలో రాజ్‌కిరణ్ ఫిలిమ్స్ నిర్మిస్తున్న పై చిత్రంలో సోమసుందర్, మధు, శైలకుమార్, సాయర్ వెంకటేశ్వర్, బాల్‌రెడ్డి, రవికిరణ్, విజయ, జయ, శైలజ వగైరా నవనటీ నట సమ్మేళనం పాల్గొంటున్నది. పేరు మోసిన తారలతోనే బిజినెస్ కాని ఈ రోజుల్లో అంతా కొత్తవారే నటించే ఈ చిత్రం ఎప్పుడు విడుదలవుతుందో మరి!

## "ముఖ్యమంత్రి జయంతి"

"సూర్య ఐ.పి.ఎస్." చిత్రం విడుదలవక ముందే తమిళంలో 25 లక్షలతో డబ్బింగ్ హక్కులు కొనుగోలు చేసిన నిర్మాత, వెంటనే జిల్లాల వారీగా మంచి రేటుకు తమిళనాడులో అమ్మగలిగాడు. దాని పేరు "మొదలమైచ్చర్ జయంతి" అంటే "ముఖ్యమంత్రి జయంతి". దీనికి ముందు విజయశాంతి.


వజ్రోత్సవం సందర్భంలో ప్రత్యేకంగా చేయించిన రజితజ్ఞాపికలు

# దర్శకుని ప్రతిభ ప్రతి సన్నివేశంలో ప్రతిబింబించే చిత్రం

# ప్రేమ పంజరం

**చిత్రసమీక్ష**
**గిద్దలూరు గోపాలరావు**

బంగారు పంజరంలో రామచిలుక చిక్కు కున్నట్టు, వైజయంతి అనే అందాలరాణి ప్రేమపంజరంలో చిక్కుకుంటుంది.

ఆమెను పంజరంలో బంధించిన వ్యక్తి వైకుంఠం అనే ఆమె తండ్రిగాని తండ్రి. వైజయంతి స్వంత తండ్రి చనిపోయిన తర్వాత ఆమె తల్లి వైకుంఠాన్ని పెళ్లి చేసుకుంటుంది. కాని ఆ తల్లి అకాల మరణానికి గురవుతుంది. తల్లి చనిపోతూ తన ఆస్తినంతా వైజయంతి పేర వ్రాస్తుంది. వైకుంఠాన్ని గార్డియన్‌గా పెడుతుంది. వైజయంతికి వివాహమైన తర్వాతనే ఆస్తి ఆమె అనుభవంలోకి వచ్చేటట్టు ఒక నిబంధన ఇరికిస్తుంది. వైజయంతి పేర వున్న ఆస్తినంతా వైకుంఠం కాజేయ్యాలని చూస్తాడు. ఆ ప్రయత్నంలో శ్రీకాంత్ అనే చాకు లాం… యువకుణ్ణి చేరదీస్తాడు. వైజయంతిని ప్రేమించినట్టు నటించి ఆమెను చంపెయ్య మంటాడు. శ్రీకాంత్ ప్రేమ నాటకం ఆడలేక, నిజంగానే వైజయంతిని ప్రేమించేస్తాడు. పెళ్లి చేసుకునేందుకు సిద్ధ మవుతాడు. కథ ఎదురు తిరగటంతో వైకుంఠం రెచ్చిపోయి శ్రీకాంత్‌ను చంపబోతాడు. వైకుంఠం తాకిడికి తనను తాను నిభాళించుకొని, తేరుకొని శ్రీకాంత్ వైకుంఠాన్నే చంపేస్తాడు. వైకుంఠం స్థానంలో యస్.ఐ.గా పనిచేస్తున్న వైకుంఠం కొడుకు తయారవుతాడు. వైజయంతిని చంపి, ఆమె ఆస్తిని చేజిక్కించు కునేందుకు యస్.ఐ. కూడా శ్రీకాంత్‌ను ఉపయోగించి చూస్తాడు. మిలిటరీ బాబాయి పటేల్ అండదండలతో ఎస్.ఐ. పన్నిన విషవలయం నుంచి బైటపడి, పంజరంలో చిక్కుకున్న వైజయంతికి విముక్తి కలిగించి, తనదానిగా చేసుకుంటాడు శ్రీకాంత్.

కథలో ప్రాణశక్తి వుంది. కొన్ని చోట్ల మంచి మలుపులు తిరుగుతుంది. ఈ కథను దర్శకుడు బి.వి. రమణా రెడ్డి చిత్ర రూపంలోకి చక్కగా మలిచాడు. ప్రతి దృశ్యం లోనూ దర్శకుని ప్రతిభ కనిపి స్తుంది. చిత్రాన్ని వేగంగా కూడా నడిపిం చాడు. "హాయిగా కాలమే తీయగా" సాహితి వ్రాసిన ఈ పాటను శ్రీకాంత్, వైజయంతిల మీద చిత్రీకరించిన దృశ్యం మనోజ్ఞంగా వుంది. ఈ పాటకు రాజ్ - కోటి సంగీతం కూడా రసమయంగా వుంది. ఇలాగే చిత్రమంతా తనదంటూ ఒక ప్రత్యే కతను కనపరిచాడు దర్శకుడు. ఇంతవరకు హాస్యనటుడుగా, చెదురు మదురుగా తెర మీద దర్శనమిస్తుండిన బి.వి. రమణారెడ్డి తెరవెనకకు వెళ్లి "ప్రేమ పంజరం" చిత్రం ద్వారా దర్శకుడుగా ఉదయించాడు. ప్రథమ ప్రయత్నంలోనే మంచి దర్శకుడుగా పేరు గాంచాడు.

పరుచూరి బ్రదర్స్ స్క్రీన్‌ప్లే, మాటలు చిత్ర విజయానికి చాలా వరకు సహకరించాయి. దర్శకత్వ పుష్టి, రచనా పటిష్టత చిత్రాన్ని బాగా రక్తి కట్టించాయి.

శ్రీకాంత్‌గా హరీష్, వైజయంతిగా నూతన నటి మధుబాల, విలన్ వైకుంఠంగా విద్యా సాగర్, యస్.ఐ. గా కొత్త నటుడు ఆనంద్, పటేల్‌గా మోహన్‌బాబు గొప్పగా నటించారు. ఆటో డ్రైవరుగా పరుచూరి గోపాల కృష్ణ, బీట్ కానిస్టేబుల్‌గా బ్రహ్మానందం, ఇతని కోట ఉద్యోగిగా ఒక అమ్మాయి యీ ముగ్గురూ చాలా వరకు హాస్యం అందించారు. ఈ ముగ్గురూ కథ అతకలేక ప్రత్యేకంగా కనిపించారు. అందరి కంటే హరీష్ ఒక ప్రత్యేక ఆకర్షణగా మెరిసి పోయాడు -- నూనూగు మీసాల నూత్న యవ్వనంతో నటనా విశ్వ రూపంతో!

వజ్రోత్సవ వేడుకకు వైభవం కల్గించిన త్రిమూర్తులు
రాష్ట్రపతి వెంకట్రామన్, గవర్నర్ కృష్ణకాంత్, ముఖ్యమంత్రి జనార్దనరెడ్డి

# సువర్ణాక్షర లిఖితం

(మొదటి పేజీ కొరవ)

రావుకు రామానాయుడు జయంతి సన్మానంజరిగింది. ముఖ్యమంత్రి ఎన్.జనార్దనరెడ్డి శాలువ కప్పి అవార్డునందజేశారు. నెల్లూరు డోలేంద్ర ప్రసాద్ సన్మాన పత్రం చదివాడు.

జమీన్ రైతు కు సహాయ సంపాదకులుగా పని చేసిన సలగసరల హెత్రికేయుసలు శ్రీఆమంచర్ల శేషగిరి రావు, శ్రీనంబోలు గోపాలకృష్ణయ్య, శ్రీకె.ఎల్.సింహా, శ్రీవి.గోపాలకృష్ణలకు గవర్నర్ శ్రీకృష్ణకాంత్ రజిత జ్ఞాపికలు అందజేశారు.

జమీన్‌రైతు తరపున శ్రీ జనార్దనరెడ్డి, రాష్ట్రపతి వెంకట్రామన్ గారికి ప్రత్యేక మెమొంటోనందజేశారు. గవర్నర్ శ్రీ కృష్ణకాంత్ జమీన్‌రైతు వజ్రోత్సవ సంచికను ఆవిష్కరిస్తే రాష్ట్రపతి శ్రీ వెంకట్రామన్ తొలి ప్రతి స్వీకరించారు.

ఈ కార్యక్రమాలన్నీ లయబద్ధంగా ,సినిమాలో రీలు తిరిగినంత క్రమబద్ధంగా, చకాచకా జరిగి పోయాయి. ఎక్కడా తొట్రుపాటులేదు. నిర్ణీత సమయం కంటే క్షణం అదనంగా పట్టలేదు. వీటన్నింటి చివర, రాష్ట్రపతి శ్రీ వెంకట్రామన్ మద్రాసుబస్టాండు కూడలిలో నెలకొల్పిన నెహ్రూ విగ్రహాన్ని ఈ వేదికపైనుంచే ఆవిష్కరించారు.

ఉపన్యాసాలు సైతం గంభీరంగా, భావ స్ఫోరకంగా వుండినాయి. ఉత్సవ వైభవానికి, హుందాతనానికి భంగంకల్గకుండా ప్రసంగించారు. వక్తలందరూ! రంగాగారు తామజమీన్ రైతు లో భాగస్వామినని సగర్వంగా ఆదరంతో ప్రకటిస్తే గోపాలరెడ్డిగారు జమీన్ రైతు తో తన అనుబంధాన్ని స్నేహశాహారంగా పరామర్శించారు. ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్దనరెడ్డి వెంకట్రామన్ గారి వ్యక్తిత్వవైశిష్ట్యాన్ని జమీన్ రైతు తో తనకు గల బాంధవ్యాన్ని సమతూకంతో ప్రస్తావించారు.

గవర్నర్ శ్రీ కృష్ణకాంత్ ప్రసంగం అత్యంత ఆలోచనా స్ఫోరకమైనది. ఆయన మేధాసంపత్తి, సిద్ధాంతాలపై సమగ్రఅవగాహన, నూతన కోణాలనుంచి దేశ నాయకుల జీవన సరళిని పరిశీలించగల సునిశిత విషయ పరిజ్ఞానం ఈ స్వల్పవ్యవధి ప్రసంగందించాలని సంహాసిచ్చాడట శ్రీ వెంకట్రామన్ పరిశ్రమల మంత్రిగా వున్నప్పుడు విదేశీ ఇండస్ట్రియలిస్ట్ ఒకరు ఒక ప్రాజెక్ట్ అనుమతి కోసం కమీషన్ ఇవ్వజూపితే ఆడబ్బుతో మరొక ప్రాజెక్ట్ పెట్టమని సంహా ఇచ్చారట రాష్ట్రపతి.

జనార్దన రెడ్డి విద్యామంత్రిగా వున్నపుడు తాను నెల్లూరు రావలసిందని, ఆ అవకాశం ఇంతటి మహోత్సవంలో, లభించడం తన అదృష్టమని అన్నారాయన.

21వ శతాబ్దంలో రచించబోయే ప్రపంచ చరిత్రలో జవహర్‌లాల్ నెహ్రూ, మహాత్మాగాంధీ లిరువురు, తమ మహోజ్వల నాయకత్వ పటిమ సాటిలేని భవిష్యద్దర్శన శక్తుల ద్వారా అత్యున్నత స్థానం అధిష్టిస్తారని గవర్నర్ చెప్పారు.

జవహర్ లాల్ నెహ్రూ విగ్రహా విష్కరణ జమీన్‌రైతు వజ్రోత్సవం కలిసి జరగడం ఒక అద్భుత సంఘటనగా వర్ణించారాయన. రైతు సమన్వయంలో మమేకం చెంది, రైతు బాంధవురాలుగా పేరు పొందిన ఒక పత్రిక 60 సంవత్సరాల పాటు వెలువడడం నెల్లూరు గర్వపడవలసిన విషయమన్నారాయన. జమీందార్లతో పోరాటం సల్పిన పత్రికగా జమీన్‌రైతు విశిష్టత అభినందనీయమని చెప్పారు.

రాష్ట్రపతి ప్రసంగం సుదీర్ఘంగా సాగింది. జవహర్ లాల్‌నెహ్రూ ఆర్థిక విధానాలే దేశానికి శరణ్యమని వాక్రుచ్చారు. రాష్ట్రపతి. ప్రణాళికబద్ధ మైన మిశ్రమ ఆర్థిక విధానమవ లంబించక పోతే దేశంలో ఈ మాత్రం ప్రగతి కూడా సాధ్యమయ్యేది కాదన్నారు.

సభ చివర శ్రీ నేదురు మల్లి పద్మనాభ రెడ్డి వందన సమర్పణ చేశారు. రాష్ట్రపతికి , రాష్ట్రప్రభుత్వం తరపున శ్రీ జనార్దన రెడ్డి పెద్ద మెమెుంటో బహూకరించారు.

అనుకున్నదాని కంటే 15 నిముషాలు ఆలస్యంగా సభ ముగిసింది. సభకు తరలి వచ్చిన జన సందోహం మాత్రం అపూర్వం. ఇటు జి.ప్ర.ప కార్యాలయం నుంచి అటు వి.ఆర్.కాలేజి కూడలి నుంచి మద్రాసు బస్టాండు వరకు మానవమహాసముద్రమే. రాష్ట్రపతి ఆ జనసందోహాన్ని చూసి, ముగ్ధులైపోయారు.

## ఎందుకింత రాద్ధాంతం?

మొదటి పేజీ కొరవ

ఇదీ జరిగింది. ప్రసంగంలో ప్రస్తావన లేదు కాబట్టి, రాష్ట్రపతి పర్యటనలో జమీన్‌రైతు ఉత్సవం భాగం కాదనడం కేవలం ఓర్వ లేని తనమే. ప్రోటోకాల్ నిబంధనలు తు..చ తప్పకుండా పాటించబడే రాష్ట్రపతి కార్యక్రమాలలో, ఆయన అనుమతి లేకుండా ఒక సభ జరగడం ఎట్లా సాధ్యమో విమర్శకులు ఆలోచించ లేదు; సభావేదిక మీద తాటికాయంత అక్షరాలతో వ్రాసిన జమీన్‌రైతు ఉత్సవ నినాదం వీరు చూడదలచు కున్నట్లు లేదు. గవర్నరు, ముఖ్యమంత్రి, రంగా, గోపాలరెడ్డి గార్ల ప్రసంగాలు కేవలం జమీన్‌రైతు పైనే ప్రధానంగా సాగిన సంగతి వీరు విన్పించుకోలేదు; జమీన్‌రైతు అవార్డు బహూకరణ, జమీన్‌రైతు సిబ్బందికి జ్ఞాపిక పంపకం, జమీన్‌రైతు ప్రత్యేక సంచికావిష్కరణ అదే వేదికపై జరిగిన వాస్తవం పట్టించు కోలేదు. అధికారులు రూపొందించిన కార్యక్రమ పత్రంలో నెహ్రూ విగ్రహావిష్కరణకు కేవలం ఒకే ఒక నిముషం కేటాయించిన సంగతి వీరు గమనించ నట్లే నటిస్తున్నారు.

కుళ్ళుమోతు తనం, ఈర్ష్యద్వేషాలతో, నిజాన్ని విస్మరించి రాష్ట్రపతి పర్యటనలో వివాదం వున్నట్లు సృష్టించి, జమీన్‌రైతు సభలో రాష్ట్రపతి పాల్గొనలేదని దుష్ప్రచారం చేసి కడుపు మంట చల్లార్చు కుంటున్నారు. హిందూ వంటి గౌరవనీయ పత్రిక కూడా ఇటువంటి నీచ ప్రచారాంకు వేదిక కావడం అత్యంత శోచనీయ విషయం. జి.పి చైర్మన్, తెలుగు దేశం మండలాధ్యక్షులు ఇటువంటి కుత్సిత ప్రచారంలో గొంతు కల్పి మాట్లాడడం వారి సంస్కార స్థాయిని తెలుపు తున్నదే తప్ప; మాకు మాత్రం బాధకలడం లేదు. వజ్రోత్సవం జరుపుకోవడమే జమీన్‌రైతు ఘనత; అది ఒకరు విమర్శిస్తే విలువ కోల్పోయేది కాదు; ప్రశంసిస్తేనే ప్రాశస్త్యం వచ్చేదికాదు. చరిత్రలో జమీన్‌రైతు స్థానం ఎప్పటికీ సుస్థిరం. సుదృఢం!

పోలీసు పేరేడ్ గ్రౌండ్‌లో హెలికాప్టర్ నుంచి క్రిందకు దిగుతున్న రాష్ట్రపతి వెంకట్రామన్, శ్రీమతి జానకి వెంకట్రామన్

## ప్రసంగాలు

(2 పేజి కొరవ)

వెళ్ళవలసిన దూరం యింకావుంది. విశ్రాంతి తీసుకోవలసిన అవసరం లేదు. ముందుముందుకు వురోగ మిస్తూనేవుండాలి.

రామానాయుడుగారు జమీన్ రైతు కు ఒక వరవడి పెట్టారు. ఏ పత్రికకూ లేని వరవడి అది. పల్లెటూరి భాష, పల్లెటూరి ప్రజలు హర్షించేభాష, పద్యాలు,పాటలు, ఆవేకరకాలైన రూపంలో ప్రజలు హర్షించే శైలిలో రామానాయుడుపత్రిక నడిపారు. అదే జమీన్‌రైతు ప్రత్యేకత. పల్లెటూరిప్రజలకు పత్రికను దగ్గరగా తెచ్చారు. ఇప్పుడు అన్ని దినపత్రికలు కూడా అదే బాటన నడుస్తున్నాయి. జమీన్‌రైతు మొట్టమొదటగా ప్రజల భాషను ఉపయోగించి ప్రజల దగ్గరకు పోవడానికి ప్రయత్నం చేసింది. అందుకు రామానాయుడు గారికి నమస్కారం పెడుతున్నాను. నిశిత వ్యాఖ్యలు కూడా జమీన్‌రైతు విశిష్టత. మంత్రులు, అధికారులు పరిపాలనలో చేసే లోపాలు నిష్కర్షగా చెప్పేవారు. పైగా ఆ భాషలో జీవం వుండేది.ప్రాణం వుండేది. రామానాయుడుగారు బ్రతికి వుంటే నూరు సంవత్సరాల పండుగ చేసుకొనేవారు. ఇప్పటికైనా ఆయన శతవార్షికోత్సవం జరపాలి.

స్వరాజ్యం వచ్చిన తర్వాత 40 ఏళ్ళలో నెల్లూరు శ్రీ రామమూర్తి జమీన్‌రైతుకు నిలకడగా స్థిరమైన స్థావరం కల్పించారు. స్వరాజ్యంముందు సమస్యలు వేరు. తర్వాత సమస్యలు, పరిస్థితులువేరు. రామానాయుడు గారికి రంగా గారివలె, శ్రీరామమూర్తికి జనార్దనరెడ్డి అండగా వున్నారు. ఇది ఇద్దరికీ లాభమే. రంగాగారు భారతరైతు నాయకుడైవాడంటే, మహానేతగా ఎదిగాడంటే జమీన్‌రైతే అందుకు పాదిపెట్టింది. ఆయన దేశానికి నాయకుడైవాడంటే అందుకు జమీన్ రైతు ప్రాపకం. అట్నే జనార్దనరెడ్డిగారుకూడా!

జమీన్‌రైతు ఇంక నూరు సంవత్సరాల ఉత్సవానికిఎదురు చూడాలి.

### మనసులో దిగులుగావుంది!

కళాకారులకే తృప్తి కల్గించే ఈ అలంకరణలు చూస్తూంటే గంటల తరబడి మాట్లాడాలని పిస్తున్నది. కాని నాకు ఇచ్చింది అయిదంటే అయిదు నిమిషాలు. నేను నెల్లూరు వాడిని అని చెప్పుకునేందుకు గర్వపడుతునా; నెల్లూరు వాడిగానే క్రిందటి 60 ఏళ్ళ నుంచి నేను జమీన్‌రైతును బలపరుస్తున్నా. నెల్లూరు పార్టీమణులకు తల్లి వంటి కనకమ్మ గారింటో రామానాయుడి బుర్రలో పుట్టింది జమీన్‌రైతు. పిచ్చిరెడ్డిగారు మద్రాసుకు వచ్చారు. నన్ను ఉద్యమంలో చేరమని. మహాత్మా గాంధీ అనుమతి రాగానే వచ్చేసాను. ఈ 60 సంవత్సరాల పర్యంతంగా జమీన్‌రైతు లో భాగస్తుడను నేను. ఈ రోజు ఈ ఉత్సవానికి విచ్చేసిన వారందరికి జమీన్‌రైతు తరవున కృతజ్ఞతాభి వందనాలు తెలియ జేస్తున్నాను. రామానాయుడు గారిని తలచుకొనే అవకాశం కల్పించినందుకు సంతోషంగా వుంది. ఈరోజు జమీన్‌రైతు అవార్డు అందుకోబోతున్న. రామ్ మోహన్ రావు గారు ఎంత అదృష్ట వంతుడో! రామానాయుడు గారి పేరుతో అవార్డు అందిస్తున్నారు. ఇది వరకు ఇటువంటి సభలు చాలానే జరిగినాయి. ఆంధ్రప్రదేశ్ లో పేరు ప్రఖ్యాతులు పొందిన ఎందరో సంపాదకులను జమీన్‌రైతును గౌరవించినది. జమీన్‌రైతు తలచుకుంటే నాకు దిగులుగా వుంది. కాని అన్ని వారపత్రికల పరిస్థితి అంతే. పెద్ద పెద్ద దిన పత్రికలు పోటీలు పడి ఇప్పటికే ఆరు ఏర్పడ్డాయి. అయితే స్వతంత్రంగా, ధైర్యంగా, ఆర్థిక, ఇబ్బందులు,లెక్కించకుండా నడుస్తున్న వార పత్రికలకు పోటీగా ఇవి. వార పత్రికలు నడపడం నాకు అభివృద్ధి వ్యవహారంగా కనపడడం లేదు. అందుకే మనస్సులో దిగులుగా వుంది. జమీన్‌రైతుకు ఏమవుతుందోనని! అయితే మనస్సులో ధైర్యంగా కూడా వుంది. దేశ దేశాల్లో, రాష్ట్రంలో వున్న నెల్లూరు వాళ్ళందరికీ జమీన్‌రైతు ప్రియతమ పత్రికగా తయారైందని. దిగులు లేదని ధైర్యం చెపుతున్నారు. ఆనాడు కృష్ణ పత్రిక లాగ ఈనాడు జమీన్‌రైతు తయారైంది. అయితే సంపాదకుడు నెల్లూరు శ్రీరామూర్తికి ఒళ్ళు బాగోలేదు. ఆయనకు నా వయస్సులో సగం కూడా లేదు. బలంగా వుండాలి. స్థిరంగా వుండాలి. గాంధీ మహాత్ముని దోరణిలో నడవాలి. దేశం హంతకుల చేతుల్లో పడిపోయిన ఈ సమయంలో స్వతంత్రంగా చలాకీగా, వుండి, కొరడా ఝుళిపించి, లేపి, లేపకొట్టి, మనల్నందరినీ కార్యోన్ముఖు ల్ని చేసే పత్రికగా తయారు కావాలి. జమీన్‌రైతు.

జమీన్‌రైతు రజతోత్సవానికి వచ్చానని చెప్పారు. జన్మదినోత్సవానికే వచ్చాను నేను. జమీన్‌రైతు పత్రిక వున్నందుకు నెల్లూరు జిల్లాయే కాదు మొత్తం ఆంధ్రరాష్ట్రం గర్వపడుతున్నది ఈనాడు. సభకు వచ్చిన వారందరికి జమీన్‌రైతు తరవున రామానాయుడు గారి తరవున కృతజ్ఞతలు తెలుపుతున్నాను



## పినాకినీతీరం

(2 పేజి కొరవ)

పనులు పూర్వంకంటె ఎక్కువగా చేయించుకోవడానికి,దేవిరించడంగా కాకుండా ధీమాతో సాధించుకోవడానికి మంచి అవకాశం.ఏమైతేనేమి పేద్దప్రవేశాన్ హిందీ నడాక్టర్ సుందరరామిరెడ్డి గారిని అభినందిస్తున్నాము.

సుందరరామారెడ్డిగారు తనకులానుగా రాజకీయాలలోకి రాలేదు.శాసనసభ్యత్వముగాఆయన కోరుకుంటే వచ్చిందికాదు. రాజకీయాలు ఆయనకు బలవంతపు మానుస్నానం! శాసనసభ్యత్వం వద్దుమొర్రో అంటే ఆయన కాళ్ళకు చుట్టుకొన్న పదవి. డాక్టరు సుందరరామరెడ్డి ఆత్మకూరులో పాపులర్ డాక్టర్ ! ఆవృత్తికే పూర్తిగా పరిమితమయివుండినవ్యక్తి . ఆత్మకూరు లంటే ఆనంసంజీవరెడ్డిగారి ఎస్టేటు. 1978 ఎన్నికల సమయంలో ఆయనవెంగళరావుగారికాంగ్రెసుకు పోయారు! ఆయన్ను కాదని ఇందిరాకాంగ్రెసు అభ్యర్థిగా పోటీచేసే సాహసవంతుడు, సంజీవరెడ్డి అభ్యర్థిని ఢీకొని గెలవగలిగిన మొనగాడు అప్పట్లో అక్కడ కనపడలేదు. అటువంటి క్లిష్టసమయంలో జిల్లాలో ఇందిరాకాంగ్రెసు నాయకత్వబాధ్యత నెత్తిన పడిన శ్రీ జనార్దనరెడ్డికి ఆత్మకూరుకు డాక్టరు సుందరరామరెడ్డి తప్ప తగిన అభ్యర్థి లేడనే సూచన వచ్చింది. సిఫారసులవత్తిడులతో అతికష్టంమీద డాక్టరుగారు అభ్యర్థిత్వాన్ని అంగీకరించారు ! అఖండవిజయం పొందారు. 1983 తెలుగుదేశంటప్పైనలో తప్ప, 1978 -85,91 ఎన్నికలలో విజయంపొందాడు .బి.జె.పి నాయకుడు యం.వెంకయ్యనాయుడుగారిని ఓడించిన ఘనత సుందరరామరెడ్డి ది.13 ఏళ్ళ రాజకీయజీవితంలోడాక్టరుగారికి మొదటిసారిగా లభించిన పెద్దపదవి యిది మరోవిశేషం ! ఆయన విగ్రామవాదైంది చెప్పడం తేల్చడంబ్రహ్మతరంకూడా కాదు! ఏమైతేనేమి జనార్దనరెడ్డి నాయకత్వంలో మొట్టమొదటిసారిగా శాసనసభ్యుడు అయినాడు!మర్రి జనార్దనరెడ్డి ముఖ్యమంత్రిత్వంపదవిని పొందాడు .

జిల్లాలో సుప్పుం వెంకటరత్నం [illegible] నాయుడుగారుజిల్లాకు వచ్చినప్పుడు జనార్దనరెడ్డిగారిని వదలడంలేదు. జిల్లాలో సీనియర్ శాసనసభ్యుడు శ్రీ నాయుడు !ఏదోఒకటి ఇవ్వకుంటే నాయుడుగారికి రాజకీయాలమీదనే విరక్తి కలిగిలేరుతుంది.

మన శాసనసభ్యులలో ఒకమిత్రుడు అంటారు! అందరూసర్దుకొన్నరెట్నాయానాదిరెడ్డి తప్ప అని ! పాపం సర్దుకోక ఏమిచేస్తున్నాడు? యానాది రెడ్డి ప్రభుభక్తి పరాయణుడు ! అధికారంలో వున్నవారిని ఏనాడూఅతిక్రమించి పోడు! ఆయనలోవున్న సుగుణం అది!

అసంతృప్తి వుండేది ఒక్కరికేననే ఆశాసనసభ్యునిఅంచనా సరైందని నేననుకోలేకున్నాను. ఈరోజుల్లో ఆశ లేనివాడు, ఆరాటపడని వాడు ఎవ్వరు చెప్పండి?వివేయుల విశ్వాసాలు.విస్మరింపబడ్డాయని బాధపడేవారు కూడా వున్నారు. అట్లా బాధపడడం పొరపాటు. విశ్వాసపాత్రుడు ఎప్పుడూ వెంటవుండి తీరుతాడు. అదొకబలహీనత.కానివిమఖంగా వున్నవారినే ప్రసన్నంను చేసుకోవాలి. రాజకీయవాదులకు చాణుక్యుడు నేర్పిన పాఠాలలో అదొకటి.తెలుసా?

ఏమైనా ముఖ్యమంత్రి [illegible] ఇవ్వదలుచుకున్నవారికిచ్చి తీరవలసిన వారికి మీనమేషాలులెక్కించకుండా ఇవ్వడం మంచిది.

NJR

Regd No. H.N.L. 18

# రెక్కాడితేగాని డొక్కాడని కష్ట జీవుల ప్రియ నెచ్చెలిగా ఎదగాలి 'జమీన్‌రైతు'

మీలాంటి కార్యకర్తలను చైతన్యవంతులను చేసి, రోజుకి గురౌతుండిన నిరుపేద జమీందారీ రైతుల సేవకు ఉద్యుక్తులను చేసిన స్వర్గీయ నెల్లూరు వెంకటరామానాయుడు గారి పాటలు, వ్యాసాలు; ఆచార్య రంగా గారి నాయకత్వంలోని జమీన్ రైతోద్యమంలో మమ్మల్ని ఉర్రూతలూగించిన ఆనాటి పుట్టాలు తరతరాలు చరిత్రలో సార్థకతను సాధించి, నిల్చిపోతాయి. ఆనాటి జమీన్ రైతు ఈనాటి రాజకీయాలలో కూడా స్థానాన్ని పెంపొందించుకుంటూ, ప్రజాదరణలో దినదినాభివృద్ధి చెందుతూ ముందుకు సాగిపోతున్నందుకు. మీ కృషికి సంపాదకీయ సామర్థ్యానికి అభినందనలు.

జమీన్ రైతు తరతరాల వరకు రాజకీయ పరిణామాలలో తన స్థానాన్ని పెంపొందించు కుంటూ, రెక్కాడితేగాని డొక్కాడని కష్టజీవుల సాంఘిక, ఆర్థిక, రాజకీయ వైజ్ఞానికాభివృద్ధికి కృషిచేయగలదని ఆశిస్తున్నాను.

గౌతు లచ్చన్న
విశాఖపట్నం

## నాయుడుగారికి జోహార్లు

ప్రజానీకాన్ని ఉద్యమోన్ముఖులను చేసి ఆంధ్ర, మద్రాసు రాష్ట్రాలలో జమీందారీ రద్దుకు కృషి చేసి సాధించి జమీన్ రైతు పత్రిక షష్టిపూర్తి సందర్భంలో కీ.శే. నెల్లూరు వెంకట్రామానాయుడుకు జోహార్లు ఉత్సవం జయప్రదం కావాలని శుభాకాంక్షలు.

...వావిలాల గోపాలకృష్ణయ్య
గుంటూరు

## వ్యాపార ఎడారిలో ఒయాసిస్సు

ఒక జాతి సాంస్కృతిక, సామాజిక సంస్కారాన్ని, మనోధర్మాన్ని వ్యక్తీకరించే మార్గంలో కవిత్వం, ఇతర కళలతో పాటు పత్రికా రంగమూ ఒకటి. ఏ జాతి అయినా సగర్వంగా చెప్పుకోగల విశిష్ట పత్రికలలో "జమీన్ రైతు" వంటి పత్రికలది ఉగ్గడింపులకు అర్హమైన స్థానం. వ్యాపారాత్మక, సంచలనాత్మక ధోరణుల ప్రభావంతో రంగురంగుల ఎడారిలా మారిపోతున్న మన భాషాపత్రికల రంగంలో జాతి ఆత్మను, ఉద్యమస్ఫూర్తిని, ప్రజోపయోగ వ్యూహాను పదిలంగా పరిరక్షించుకొంటూ అరవై వసంతాలు దిగ్విజయంగా నిర్వహించ బడుతున్న జమీన్ రైతు అక్షరాలా "ఒయాసిస్సు" నేషనల్ హెరాల్డ్ సంపాదకుడు ఎం. చలపతిరావు ఒక సందర్భంలో చెప్పినట్లు Modern Technolgoy has done every thing to arnament body of Journalism, but there is Calamity impending to it 's soul". పత్రిక ఆత్మను రకరకాల కాలుష్యం నుండి కాపాడుకొంటూ నడుపుతూ వస్తున్న మిత్రులు నెల్లూరు శ్రీరామమూర్తికి జేజేలు.

జాతీయ, జమీందారీ వ్యతిరేక ఉద్యమాల్లో ఊపిరి పోసుకున్న జమీన్ రైతు తక్కిన ఉద్యమపత్రికలలో కొన్నింటివలె కనుమరుగుకాకుండా వుండడం తెలుగువారి సౌభాగ్యం. పెద్ద పత్రికలు దిన, వార, పక్ష విచక్షణ లేకుండా, సర్క్యులేషన్ల పోటీలో జిల్లా ఎడిషన్లు ప్రారంభించి . పాఠకుల వ్యక్తిత్వాన్ని మండల స్థాయికి దిగజారుస్తున్న దుస్థితిలో ప్రాంతీయ పత్రికగా తనదైన ప్రపంచ దృక్పథంలో నడిచే విశిష్టత జమీన్ రైతుదే.

సి.రాఘవాచారి
*సంపాదకుడు విశాలాంధ్ర, విజయవాడ

# సందేశాలు

## అపూర్వమైన పత్రిక

"జమీన్‌రైతు" పత్రికను అనేక విధాలుగా అపూర్వమైన పత్రికగా పరిగణించవచ్చు. మన ఆంధ్ర ప్రదేశ్‌లో అరవై రెండు ఏండ్లుగా విరామం లేకుండా ప్రచురించడం దాని ప్రత్యేకత. మన స్వాతంత్ర్య పోరాటానికి, రైతాంగ పోరాటాలకు జమీన్‌రైతు పత్రిక ఇచ్చిన మద్దతు మరువరానిది. అంతేగాదు. మన రాష్ట్రంలో ప్రాంతీయ పత్రికగా తన విశిష్టతను నిలుపుకోవడం కూడా దాని ప్రత్యేకత.

ఉత్సవాల సందర్భంగా సోదర పత్రిక ఆంధ్రజ్యోతి సంపాదకులు శ్రీ నండూరి రామమోహన్‌రావు గారిని సన్మానించడం అత్యంత సముచితంగా ఉంది. అందుకు నా ప్రత్యేకమైన అభినందనలు మీకు అందజేస్తున్నాను.

... వి.ఆర్. బొమ్మారెడ్డి, ప్రజాశక్తి
ఎడిటర్, విజయవాడ

## విశిష్టమైన పాత్ర

నేను 45 సంవత్సరాల క్రితం బాబా నా పద్నాలుగవ ఏట జర్నలిజంలో ప్రవేశించినప్పటినుంచి జమీన్‌రైతుకు పాఠకుడను. దానిలోని రచనలు, వార్తలు, భావిరాజకీయ జోస్యాలు, నాకు ఎంతో ఉపకరిస్తూ వచ్చాయి. శీర్షికలలో జమీన్‌రైతుకు ఎప్పుడూ ప్రత్యేకత. ఆంధ్ర దేశ స్వాతంత్ర్య చరిత్రలోను, జమీందారీ వ్యతిరేక పోరాటంలోనూ "జమీన్‌రైతు" విశిష్టమైన పాత్ర. ఏక బిగిని అరవై రెండు సంవత్సరాలుగా ప్రచురించబడుతున్న తెలుగు వార పత్రిక జమీన్‌రైతు. ఆ తరువాత వచ్చిన ఎన్నో వార పత్రికలకు జమీన్‌రైతు మార్గదర్శకమైనప్పటికీ, అవి నిలువ జాలకపోయినాయి. ఎన్నో ఆటుపోటులకు జమీన్‌రైతు తట్టుకుని నిలబడింది. ఇందుకు స్వర్గవాసి రామానాయుడుగారు, ఆ తరువాత నెల్లూరు శ్రీరామమూర్తిగారు, ఎంతైనా అభినందనీయులు.

జమీన్‌రైతు వజ్రోత్సవాలలో రాష్ట్రపతి, రాష్ట్ర గవర్నర్, రాష్ట్ర ముఖ్యమంత్రి పాల్గొనడం ఆ పత్రిక సుదీర్ఘ సేవకు, ప్రతిష్ఠకు ఎంతైనా అనుగుణంగా ఉంది.

... తుర్లపాటి కుటుంబరావు
విజయవాడ

## వందేళ్లు పూర్తి చేసుకోవాలి!

జమీన్‌రైతు వజ్రోత్సవాలను నిర్వహిస్తున్నారని తెలిసి ఎంతగానో సంతోషించాను. భారత దేశ ప్రథమ పౌరులైన శ్రీ ఆర్. వెంకట్రామన్ గారిని ఆహ్వానించడం ద్వారా నెల్లూరు పౌరులకు మీరు మహదవకాశాన్ని కలిగించారు.

జమీన్‌రైతు వజ్రోత్సవాల సందర్భంగా దేశాధ్యక్షుడినీ, రాష్ట్ర గవర్నర్‌నూ, రాష్ట్ర

మిగతా 7 పేజిలో



జమీన్‌రైతు వజ్రోత్సవ వేదిక మీద - నండూరి రామమోహనరావు, ఎన్.జి.రంగా, బెజవాడ గోపాలరెడ్డి, గవర్నర్ కృష్ణకాంత్, రాష్ట్రపతి శ్రీ వెంకట్రామన్, ముఖ్యమంత్రి జనార్దనరెడ్డి, శ్రీమతి రాజ్యలక్ష్మి, ఆనం సంజీవరెడ్డి, నెల్లూరు శ్రీరామమూర్తి

# అవినీతి ఆరోపణలతో అసమ్మతిమళ్ళీమొదలు?

**రాజధాని రాజకీయం**

అణగిపోయి వుండిన అసమ్మతి అవినీతి ఆరోపణల పుణ్యమా అని తిరిగి తలెత్తింది. రెండుసార్లు మహోధృతంగా విరుచుక పడిన అసమ్మతి ఉప్పెనను అవలీలగా ప్రక్కకు నెట్టిన ముఖ్యమంత్రి శ్రీ ఎన్.జనార్దన రెడ్డి మరొక సారి ఆ ఉచ్చులో చిక్కుక పోయారు. ప్రకాశం జిల్లా చీమకుర్తిలో తన కుమారుడు రామ్‌కుమార్‌కు, అతడి మిత్రులకు కలిపి 60 ఎకరాల గ్రానైట్ గనులు లీజుకు ఇచ్చిన సంఘటన అసెంబ్లీలో పెద్ద దుమారం రేపింది. ముఖ్యమంత్రికి రక్షణ కల్పించే అధికారులే కొందరు రహస్యంగా ఈ వివరాలను వెల్లడి చేసి, శత్రువుల విమర్శల తూటాలకు గురి చేశారని వదంతి.

జనార్దన రెడ్డిపై ధ్వజమెత్తడానికి ప్రజలలో చెడ్డ పేరు తేవడానికి ఏమి దొరుకుతుందా అని ఎదురు చూస్తుండిన అసమ్మతీయులకు ఇది దేముడిచ్చిన వరంగా ఉపకరించింది. డాక్టర్ వై.ఎస్. రాజశేఖర రెడ్డి, శ్రీ నల్లపు రెడ్డి శ్రీనివాసులు రెడ్డి, సుధీర్‌కుమార్ వంటివారు గ్రానైట్ గదతో లూటీ దండయాత్రకు తరలి వస్తున్నారు. ఈసారి లోనే సి ఎల్ పి సమావేశానికి రిక్విజిషన్ ఇచ్చారు. వీరికి చెప్పుకోదగిన ఎమ్మెల్యేల మద్దతు లేకపోయినప్పటికీ - మానిన ఎర్ర పుండును గెలికేందుకు వీలు చిక్కింది. శాసన సభ్యులకు ఇళ్ల స్థలాలు, చేర్మన్ గిరుల పంపకం ద్వారా అసమ్మతిపై ఎదురుదాడి చేస్తుండిన ముఖ్యమంత్రి, ఇప్పుడు ఆత్మ రక్షణ చేసుకోవలసిన స్థితికి చేరుకున్నాడు. ఈ ప్రమాదం నుంచి, ప్రజలలో చులకన కాకుండా ఆయనెట్లా బయట పడతాడో వేచి చూడవలసివుంది. ✻

Edited, Printed and Published by N.Dolendra Prasad at Zamin Ryot Press, Nellore, OFFSET Printing at Nayagara Books Pvt, Ltd, Nellore.